# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

కొత్త సీరియల్
**జీవితం దేజారిందా!**
ప్రారంభం!

28-మార్చి, 3-ఏప్రిల్,
రు. 2-50

**జయసుధ సమాధానాలు**
ప్రారంభం!

**ఇద్దరూ ఉద్యోగస్థులైతే...!**
ఐ.పి.ఎస్. దంపతులతో ఇంటర్వ్యూ

# ఫారెక్స్® మొట్టమొదటి ఎంపిక!

## ఎందుకంటే క్రొత్త మేలుపర్చబడిన ఫారెక్స్® మొదట మొదట ఘన ఆహారాలకు మారే పాపాయికి సహాయకరంగా అత్యావశ్యక పదార్థాల సమ్మేళనం.

**ప్రొటీన్లు మరియు క్రొవ్వు పదార్థాల సరియైన కలయిక.**
ఫారెక్స్. పాపాయి బలంగా మరియు ఆరోగ్యవంతంగా పెరిగేలా తోడ్పడటానికై ప్రొటీన్లతో సమృద్ధమైనది. పాపాయి యొక్క సున్నిత జీర్ణశక్తికి అనువుగా సరియైన పాళ్లలో క్రొవ్వు పదార్థంతో ప్రత్యేకంగా రూపొందించబడినది.

**పాపాయి రక్తాన్ని ఆరోగ్యవంతంగా వుంచడానికి తగినంత ఐరన్.**
నాల్గవ నెలప్పటికి పాపాయి యొక్క ఐరన్ నిల్వ తరిగిపోతుంది. పాపాయి రక్తాన్ని ఆరోగ్యవంతంగా వుంచి రోగాలను ఎదుర్కోడానికి సహాయకరంగా తగినంత ఐరన్ కల్గినది ఫారెక్స్.

**కాల్షియం-ఫాస్ఫరస్‌ల ఆదర్శవంతమైన నిష్పత్తి.**
దిన-దినమూ, పాపాయి పళ్లు, ఎముకలు బలంగా మరియు ఆరోగ్యవంతంగా పెరిగేలా తోడ్పడటానికి, ప్రత్యేకంగా రూపొందించబడిన ఫారెక్స్‌లో కాల్షియం, ఫాస్ఫరస్‌లు ఆదర్శవంతమైన 2:1 నిష్పత్తిలో కలవు.

మరి మీరు పాపాయికి పెట్టే ప్రతి చెంచాడు పోషణ తత్వ-యుక్త ఫారెక్స్ మరింత రుచికరం. కలపడానికి మరింత సులభం.




క్రొత్త మేలు పర్చబడిన **ఫారెక్స్®**

పాలు చేర్చే అవసరం లేదు.
కేవలం నీటిలో కలిపి పట్టండి

ప్రేమతో గ్లాక్సో నుండి!

CLARION/B/GX/10/244 TEL



## నమ్మలేని నిజం!

# మీరు మీ నడుము, తుంటి, తొడల లావును 2 నుండి 7 సెం.మీ.ల వరకు తగ్గించుకోవచ్చు. కేవలం కొద్ది రోజులలోనే.

# అందుకు బుల్‌వర్కర్ వారి కొత్త సౌనా సిస్టమ్ 900

ఏ గొడవా లేకుండా 14 రోజులు ఉచితంగా ఇంట్లో పరీక్షకు సదుపాయం

**ఒక్క సౌనా సిస్టమ్-900 మాత్రమే ఇలాంటి ఫలితాలను సాధించగలదు.**

లావు ఎక్కువ తగ్గించుకునేందుకు ఆహార నియమాలకు సంబంధించిన మాత్రలు, నియమిత ఆహారం లేక తెలుసున్న మరే ఇతర పద్ధతులకన్న ఎంతో సులభంగా, త్వరగా నాజూకుగా రూపొందేందుకు ప్రపంచంలో లభ్యమయే పద్ధతి సౌనా సిస్టమ్-900.

**డయిటింగ్ అఖ్ఖర్లేదు**

సంవత్సరాల తరబడి పరిశోధన, పరీక్షల తర్వాత రూపొందించబడిన అద్భుతమైన సౌనా సిస్టమ్-900, మీ శరీరంలో ఎక్కువైన లావును ఎక్కడ తగ్గించుకోవాలంటే అక్కడ, డయిటింగ్‌తో పనిలేకుండా తగ్గించుకునేందుకు తోడ్పడుతుంది. 'తగ్గించే ఆహారాలు' మల్లే వదులుగా పెళుసైన చర్మాన్ని మిగల్చదు. ఎక్కువైన కొవ్వు తగ్గేసరికి మీ శరీరం మరింత నాజూగ్గా, గట్టిగా రూపొందుతుంది. సౌనా సిస్టమ్-900 ఎంత త్వరగా అద్భుతంగా పనిచేస్తుందంటే మొట్టమొదటి రోజునే ఆ తేడా ఏమిటో కొలుచుకు చూసుకోవచ్చు మీరు!

**గ్యారంటీగా ఫలితాలు, లేకపోతే మీ డబ్బు వాపస్.**

మొదటి రోజునే మొదలై కొలుచుకోగల ఫలితాలను మీరు చూసుకోవచ్చు. ఏ గొడవా లేకుండా మీ అంతట మీరే చూసుకోండి. ఒకవేళ మీకుగాని ఆ 14 రోజుల ఉచిత పరీక్ష సదుపాయపు సమయంలోగా, ఎక్కువైన లావు తగ్గలేదు శరీరం నాజూగ్గా, గట్టిగా మారలేదు అనిపిస్తే, పూర్తి డబ్బు (రవాణా, నిర్వహణ ఖర్చులు మినహా) కొరకు అన్నింటినీ మాకు తిరిగి పంపెయ్యండి. ఏ ప్రశ్నలూ వేయబడవు!

అన్ని ప్రముఖ స్పోర్ట్స్ షాపులలో దొరుకుతుంది. రూ. 196/-కి
వి.పి.పి. ద్వారా దొరికే చోటు డిపార్ట్‌మెంట్ SS-181- R -85.
మెహతా మహల్, 15, మేథ్యూ రోడ్, బొంబాయి-400 004.

## మీ నడుము నాజూగ్గా, సన్నగా అవటం ఈ ఎ, బి, సి లంత సులభం.

A

ఈ సులభమైన వ్యాయామాలను సౌనా సిస్టమ్-900 తో రోజుకి 10 నిమిషాలు చేయండి.



B

మీరు వ్యాయామం 20 నిమిషాలు చేశాక, విశ్రాంతిగా, చదువుకుంటున్నా, సంగీతం మొదలైనవి వింటున్నా సౌనా సిస్టమ్-900 ని ఆన్ చేసే ఉంచండి.



C

సౌనా సిస్టమ్-900 ని ఫలితాలను చూడండి. మీ నడుము బిగువయింది. చదునయింది, గట్టి పడింది అని తెల్సుకుంటారు.



ప్రపంచ మంతటా వేలాది సంతృప్తిపడ్డ ఖాతాదార్లు




విజయం, లేకపోతే మీకు ఖర్చేం లేదు!

## నేడే ఈ కూపన్‌ని పోస్ట్ చేయండి

బుల్‌వర్కర్ SS-181-R-TEL
మెహతా మహల్, 15, మేథ్యూ రోడ్, బొంబాయి-400 004. SW-52 AP

నాకు 14-రోజులు ఉచితంగా ఇంట్లో పరీక్షకు కొత్త సౌనా సిస్టమ్-900 ని వెంటనే పంపండి. ఫలితాలతో నాకు పూర్తిగా సంతృప్తి కలగకపోతే పరీక్షా సమయంలోగా నేను అన్నింటినీ వెంటనే డబ్బు (రవాణా, నిర్వహణ ఖర్చులు మినహా) వాపస్ కొరకు తిరిగి పంపి వేయవచ్చును.

సరైన గడిలో ☑ టిక్ చేయండి.

☐ రిజిస్టర్డ్ పోస్ట్ పార్సెల్ ద్వారా పంపండి. నేను రూ. 196/-కి డ్రాఫ్ట్/ఐ.పి.ఓ. ఎం.ఓ. నం. .................... తేదీ .................... పంపిస్తున్నాను. (బుల్‌వర్కర్ ప్రైవేట్ లిమిటెడ్ వారి పేరున).

☐ వి.పి.పి. ద్వారా పంపండి నేను దీనిని అందుకోగానే పోస్ట్‌మ్యాన్‌కి రూ. 196/- ఇస్తానని వాగ్దానం చేస్తున్నాను.

పేరు ..........................................

ఎడ్రసు ..........................................

పిన్ .................... సంతకం ....................

## అకట్టు కుంటున్నది

21–27 '86 శ్రీదేవి ముఖచిత్రంలో వెలువడిన మా(మీ) పత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది అభిమాన తారలపై అభిప్రాయం శీర్షిక మమ్ములను చాలా అకట్టుకుంటున్నది

–నాగండ్ల వెంకటేశ్వర్రావు రమేష్, అమ్మాపాలెం దొర్నకల్

## కొత్త శీర్షిక

'అర్చన' ముఖచిత్రం (14–20) చాలా బాగుంది కొత్త శీర్షిక అభిమాన తారలపై అభిప్రాయం లో అభిమాని+ హీరో ఫొటో వేయడం– చాలా–చాలా వెరైటీగా, ఒక ఎట్రాక్షన్

–కిర్తి కిష్టయ్య, లక్ష్మీదేవిపల్లి

## సీరియల్

ఆర్వీ రమణప్రసాద్ గారి సాక్షి సీరియల్ వారం వారం కొంగ్రొత్త మలుపులతో రసవత్తరంగా సాగుతున్నది డాక్టర్ ఆనంద్ గారి ఆకస్మిక మరణం మైత్రేయి కళ్యాణ్‌ల ప్రవర్తనలు రచయిత కుతూహలాన్ని రేకెత్తించే విధంగా మలచారు

గొర్కిల్ల రమణారావు
లక్ష్మీబాయి ఖర్గపూర్

* * *

మనసుకు సంకెళ్ళు సీరియల్ చాల బాగుంది రాబోవు పత్రికకై ఎదురు చూచేలా చేస్తుంది చక్కటి సీరియల్ రాస్తున్న రచయిత్రికి నా




హృదయపూర్వక అభినందనలు

పి ప్రభావతి అనారా
(పశ్చిమ్‌బెంగాల్)

## కథలు

నటి అర్చన ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో సత్యం–శివం–సుందరం కథ చాలా బాగుంది ఈ కాలంలో జరిగే ఘరానా దొంగతనాల గురించి చక్కగా వివరించారు

–సింగందత్తాత్రేయమూర్తి, ఇతరులు, ఒంగోలు

## ధర్మపథం

శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన 21–27 ఫిబ్రవరి 1986 సంచిక శోబాయమానంగా వున్నది బులుసు వేంకట రమణయ్య గారి ధర్మపథం (ప్రాచీన విజ్ఞాన సర్వస్వాలు) ఆధ్యాత్మికముగా వున్నది పురాణాలు మానవుల జీవితానికి దర్పణాలు అంటూ వివరించిన తీరు అద్భుతం

మోదేకుర్తి సత్యనారాయణ,
మోదేకుర్తి సుబ్బారావు, అన్నవరం □


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938-1972)

28 మార్చి-3 ఏప్రిల్, 1986
శ్రీక్రోదన నామ సం పాల్గుణ శు తదియ
సంపుటము 78 : సంచిక 29

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 2-50 |
| పోస్టులో 6 నెలల చందా | రు | 71-50 |
| పోస్టులో 12 నెలల చందా | రు | 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాందినగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం ·
నటి విజయశాంతి


కథలు

| | |
|---|---|
| చేపలు | 16 |
| పడమట సంధ్యారాగం | 24 |
| గీతోపదేశం | 52 |
| వ్యక్తిత్వం | 61 |

సీరియల్ నవలలు:

| | |
|---|---|
| జీవితం చేజారిందా? (ప్రారంభం) | 8 |
| బ్రూస్‌లీ చరిత్ర | 20 |
| ప్రేమసాగరం | 28 |
| చైతన్య స్వరూపం | 44 |
| మనసుకి సంకెళ్ళు | 56 |

వ్యాసాలు, శీర్షికలు :

ఉత్తరాలు-4 న్యూఢిల్లీలేఖ 6 ఇద్దరూ ఉద్యోగస్తులైతే !-15, ప్రశ్నావళి-22, జయసుధ సమాధానాలు-32 సినిమా విశేషాలు-33, ఎన్ టి ఆర్ కు నేపథ్యంలో మాట్లాడిన కంచు కంఠం-36 అభిమాన తారలపై అభిప్రాయం!-42, డాక్టరు సలహాలు-46, యోగ భూమి గంగోత్రి-48, వ్యక్తిగత ం, వారఫలం-50, ధర్మపథం-59, ఇ'వేమన' పద్యాలు-64, హైదరాబాద్ నోట్‌బుక్-65, అవీ- ఇవీ- అన్నీ-66

# సంపూర్ణ ఆరోగ్యానికి-సంతృప్తికర మైన భోజనానికి



1



**A. S. బ్రాండ్** పప్పునూనె మరియు **మాన్షన్ బ్రాండు** నువ్వులనూనెతో తయారయ్యే వంటకాలతో మీరు ఎన్నడూ చేయనంత సంతృప్తిగా భోజనం చేస్తారు వంటకాల్లో వచ్చే రుచి, కమ్మదనం అద్వితీయం

2



అన్నిరకాల ఊరగాయలను సంవత్సర పొడువునా మెత్తబడనీయకుండ, రుచికరంగా, ఘుమఘుమ్మలాడుతూ, తాజాగా ఉంచుతుంది

3



గుండెపోటు, రక్తపోటు అరికట్టడంలో గొప్పగా సహాయపడుతుంది

**15,5,2** కేజీల డబ్బాలలో ఇండియన్ గవర్నమెంట్ వారి అగ్‌మార్కు సీలుతో లభించును.




## అంబటి సుబ్బన్న అండ్ కో. సామర్లకోట, A.P.

# ప్రజాస్వామ్య పరిధిలోని ఏ సమాజమైనా పదిలమే

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

మరొక నియంత నిష్క్రమించారు. అంటే అమెరికా సంయుక్త రాష్ట్రాలకి మరో మిత్రుడు దూరమై పోయినట్లే. ఈ సంవత్సరంలో మొదట హైతీ అధ్యక్షుడు బేబీడాక్ అందగత్తె అయిన తమ భార్యతో సహా ఫ్రాన్స్‌కి పారిపోయారు. ఆయన తమతో పాటు పావు బిలియన్ డాలర్లకి పైగా విలువైన ఆభరణాలు, బంగారం తీసుకు వెళ్ళారు. అది జరిగిన నెల లోపు గానే మార్కోస్ తమ అధ్యక్ష భవనం నించే అమెరికా హెలికాప్టర్ సహాయంతో దేశం వదలి పారిపోయారు. హైతీలోని డువాలి-యర్‌లు ఫిలిప్పయిన్స్‌కి చెందిన మార్కోస్‌లు అమెరికా సంయుక్త రాష్ట్రాలకి ఎన్నో ఏళ్ళుగా కీలుబొమ్మల లాగా ఉన్నారు వీరంతా నికరాగువాకి చెందిన సోమోజా లాటిన్ అమెరికాలోని బజారు రవుడుల తరహా పాత సంప్రదాయానికి చెందినటు వంటి వారే ఇరాన్ రాజు విషయం వేరు కాని వాస్తవంగా చూస్తే పెద్ద తేడా ఉండదు ఏకారణం వల్లనో అమెరికా వారు తృతీయ ప్రపంచంలోని నియంతలతో సంబంధాలని అభిలషిస్తారు అయితే వాళ్ళు కష్టాలలో పడినప్పుడు మాత్రం వారిని వదిలి వేస్తారు బేబీడాక్ అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఆశ్రయం కోరినా అది ఆయనకి లభించలేదు అన్ని డాలర్లు విలువగల ఆభరణాలు బంగారం ఆయన వద్ద ఉండికూడా ఇంకా నిరాశ్రయులుగానే ఉన్నారాయన ఇరాన్ రాజు కూడా ఒక దేశం నించి మరో దేశానికి తిరగవలసి వచ్చింది ఆయన తమతో పాటు ఉండటానికి అమెరికా వారు అంగీకరించలేదు చివరికి మార్కోస్ ఎక్కడ మకాం పెడతారో నాకు తెలియదు కాని రీగన్ గారి వాషింగ్‌టన్‌లో ఆయనని ఉండనిస్తారన్నది మాత్రం అనుమానమే

ఈ మార్కోస్ వ్యవహారానికి 1975లో శ్రీమతి గాంధి వ్యవహారానికి పెద్ద తేడా ఏమి లేదు గతంలో మార్కోస్ మోసంతో ఎన్నికలలో తిరిగి గెలిచారు అయినా కొన్నేళ్ళ పాటు ఎలాగో నిలదొక్కు కోగలిగారు కాని శ్రీమతి గాంధి ఎన్నిక చెల్లదని తీర్పు వచ్చింది వెంటనే ఆమె అత్యవసర పరిస్థితి విధించారు ఇప్పుడు మార్కోస్ ప్రజలు తమకి ఎదురు తిరిగారని తెలియగానే అదే పని చేశారు దానినించి శ్రీమతి గాంధి బయట పడగలిగారు. ఎందుకంటే భారతీయులు ఫిలిప్పినోలు కారు కాబట్టి వాళ్ళకి కొరజాన్ అక్వినో ఉన్నట్లుగానే మనకి జె పి ఉండేవారు శ్రీమతి గాంధి ఎన్నికలు నిర్వహించి ఉండక పోతే ఆమె కూడా మార్కోస్ ఎదుర్కొన్న పరిస్థితినే ఎదుర్కోవాల్సి వచ్చేది అప్పుడు ఆమె సఫ్దర్ జంగ్ రోడ్డులోని ఒకటవ నెంబరు ఇంటిలో నించి బయట పడేందుకు ఒక తృతీయ ప్రపంచం లోని ఏ నియంత అయినా ఆఫ్ఘనిస్తాన్‌లో కర్మాల్‌లాగా రష్యా కీలుబొమ్మో లేదా అమెరికా కీలు బొమ్మో అయితే తప్ప మనలేడు. ఎందుకన్నది నాకూ ఆశ్చర్యంగానే ఉన్నది.

రాజీవ్ గాంధి నెమ్మది నెమ్మదిగా తమ తల్లి అడుగు జాడలలోనే వెళ్తున్నట్లు నాకు అనిపిస్తున్నది. ప్రభుత్వ ప్రమేయం అన్నది అతి తక్కువగా ఉండే పెట్టుబడి దారీ వ్యవస్థ నమూనాకి దీనికి ఏదో సంబంధం ఉండి ఉండాలి. దానినే ఆయన తీసుకోవాలనుకుంటున్నట్లు కనిపిస్తుంది.

మార్కోస్, బేబీడాక్, కి శే సోమోజాలతో సహా తృతీయ ప్రపంచ నాయకులకి ఎవరికి అది సాధ్యం కాలేదు ఈ దేశాలన్నీ ఇంకా చాలా బీదవిగానే ఉన్నాయి హైతీ తలసరి ఆదాయం మనకంటే తక్కువ అయితే పెట్టుబడిదారీ వ్యవస్థ పేదరికాన్ని గుర్తించదు అసమానతలని మరింత వృద్ధి చెయ్యటం ద్వారా అది పేదరికం మరింత పెరగ-టానికి దోహదం చేస్తుంది మార్క్సిస్టు ఆర్థిక వ్యవస్థ లాగే స్వేచ్ఛా వాణిజ్య ఆర్థిక వ్యవస్థకి కూడా దానికి ఉండే వత్తిడులు దానికి ఉంటాయి చివరికి దానివల్ల లాభం పొందేవారు దోపిడీకి గురయ్యే-వారు అన్న రెండు వర్గాలుగా అది సమాజాన్ని చీలుస్తుంది పాశ్చాత్య దేశాలలోని ఎన్నో పెట్టు బడిదారీ సమాజాలలాగా ఆ సమాజం కూడా ప్రజా-స్వామ్య పరిధిలో ఉన్నట్లయితే ఆ చీలిక విస్ఫోటానికి దారి తీయదు ప్రజాస్వామ్య సంప్రదాయాలు లేని లేదా ఉన్నత స్థానంలో ఉన్న వారు వాటిని ధ్వంసం చేసినటువంటి సమాజాలలో విస్ఫోటనాలు తప్పనిసరి అవుతాయి

మార్కోస్, బేబీడాక్ వంటి వ్యక్తులు వారి సమాజం తయారు చేసినటువంటి వారే వారు ఆ సమాజాన్ని లోపలినించే కలుషితం చేసారు కాబట్టే అలాంటి నీచమైన వ్యక్తులుగా తయారైనారు రాజీవ్ ఆయన బృందం మారిపోదామని అనుకుంటున్న అదుపూ అపూలేని పెట్టుబడి దారీ విధానం ఆధునికీకరణ పేర జరుగుతున్నది ఇది కూడా ఒకరకం అవినీతివంటిదే అలాంటి విధానం ఫలితం పెట్టుబడి ఎవరిదైతే వారికి దక్కుతుంది, లేదా దానివల్ల లబ్ధిపొందే వారికి లభిస్తుంది ప్రభుత్వానికి పెద్ద వ్యాపారానికి మధ్య ఉండే విభజన రేఖ చాలా సన్నగా ఉండవచ్చు ఫిలి-ప్పయిన్స్, హైతీ, భుట్టో, జియాలక్రింద ఉన్న పాకిస్తాన్‌లో అది అలాగే ఉంది ఆధునికీకరణ ఫలితాలని పెద్ద వ్యాపారంతో పంచుకున్న శ్రీమతి గాంధి హయాంలో ఆ రేఖ ఇంకా సన్నబడిపోయింది

తమ తల్లిలాగా తాము చెయ్యమని రాజీవ్ గాంధి వ్యక్తులకన్నా ఎంతో పెద్దదని మనం గుర్తించు-కోవాలి. రాజీవ్ గాంధీకి రాజా విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ వంటివారు క్యాపిటలిస్టులుగా మారిన ప్యూడల్ ప్రభువులు మిత్రులుగా ఉన్నారు వారు తమ వ్యక్తిగత నిజాయితీ గురించి గొప్పలు చెప్పుకుంటారు మార్కోస్‌కి కూడా అలాంటి మిత్రులే ఉన్నారు బహుశ మన రాజాసాబ్ కన్న వారు ఎక్కువ నిజాయితీ గలవారు అయినా మార్కోస్‌కి పతనం తప్పలేదు సమాజ వ్యతిరేకమైన వ్యవస్థని మీరు నడిపితే దాన్ని కూలద్రోయడం ద్వారా సమాజం చక్కదిద్దుతుంది ఇప్పుడు మనిలాలో ఇటీవల హైతీలో అయిదారేళ్ళకి ముందు ఇరాన్‌లో జరిగింది అదే 1977లో కూడా దాదాపు అదే జరిగిందని అనుకోవాలి జనతా పార్టీ విజయం ప్రజాచైతన్యానికి ఘనవిజయం శ్రీమతి గాంధి తెలివైన వారు కాబట్టి తెగేదాకా లాగలేదు అందువల్లనే దేశం రక్షింపబడింది లేకపోతే ఆమె కూడా దేశం వదిలి పోవాల్సి వచ్చేది

ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానాన్ని ముఖ్యంగా సోషలిజం ముసుగులో దానిని నిర్వహించడాన్ని నేను మెచ్చను అయితే అదుపూ అపూ లేనటువంటి ప్రయివేటు వాణిజ్యం కూడా నాకు నచ్చదు ఎందుకంటే భారత దేశం వంటి దానికి అవి ఏమాత్రం నప్పవు రాజాసాబ్ ఆయన లాంటి మరికొందరు ఆధునికీకరణ అన్నది ఒక ప్రయోజనం కోసం అనీ ఆ ప్రయోజనం లక్ష్యం ప్రజాహితం అయిఉండాలన్న దానిని విస్మరిస్తున్నారు ప్రపంచంలోని అతి పేదదేశాలలో ఒక దానిలో ప్రజాహితం అంటే ప్రజలందరికి తిండి- బట్ట లక్షలాది మందికి ఉద్యోగాలు అని అర్థం రాజీవ్ గాంధి నమూనా కంప్యూటర్‌లు రంగుల టీ వి ఉన్నత సాంకేతిక విజ్ఞానం ఎవరికీ ఉద్యోగాలనికాని తిండి -బట్టలని కాని సమకూర్చవు ఎన్ని దీర్ఘకాలిక ఆర్థిక విధానాలు ప్రవేశ పెట్టినా ఎన్ని విదేశీ సహకార ఒప్పందాలపై సంతకాలు చేసినా లాభం లేదు మార్కోస్ పతనానికి ముందు మనిలాస్టాక్ ఎక్స్‌చేంజి మన బొంబాయి కలకత్తాల కంటే బాగానే ఉన్నది అలాంటి పరిస్థితులలో అవి అలాగే ఉంటాయి కాని మార్కోస్ బృందం రక్షింపబడలేదు రాజీవ్

## మాటలకు మౌనానికి మధ్య మధురక్షణాలు

ఏదియేమయినా పరవాలేదనుకొనే మధుర క్ష
మీ జీవితంలో ఎన్నో. మౌనసామ్రాజ్యం వ
ఉద్వేగపూరితమైన నవ్వుతో—ఏకమైన వే
ఇంకెవ్వరూ, కాదు ఈ ప్రపంచమే ఏమైనా
లేదు నిజమే మీకు ఈ మధుర క్షణాలకు
ఏదీ అడ్డురాకుండా ఉండేందుకు అవసరమై
కోహినూర్ లేత ఎఱుపు మీ మృదువైన అ
చనలకు సున్నితత్వానికి రక్షణనిస్తుంది శ్రే
లేటెక్స్‌తో తయారుచేయబడినది పూర్తి ర
నివ్వడానికి ఎలెక్ట్రానిక్ సాధనాలతో పరీక్ష
బడినది. మృదువుగా ఉండేందుకు ల్యూబ్రికే
చేయబడింది.




**KOHINOOR**

లేత ఎఱుపు సుకుమారమైన కండోం

tk తయారీ.

# జీవితం చేజారిందా?

## కొంకాని కమల

చైత్రమాసం....

సమయం.... మధ్యాహ్నం పన్నెండు గంటలు కావస్తూంది.

అగ్నిగుండంలా నడినెత్తిన సూర్యుడు మండి పడుతున్నాడు.

ఎండ చుర్రుమంటూంది. పొయ్యిమీది పెనంలా రోడ్డు సలసలా కాగుతూంది.

ఆ వేడికి అక్కడక్కడా తారు కరిగి సన్నగా కాల్వ కడుతూంది.

రోడ్డు దాదాపు నిర్మానుష్యంగా వుంది.

వుండి వుండి మోటారు వాహనాలు.. సర్రున వేగంగా దూసుకుని పోతున్నాయ్.

అంతకుమించి ఎక్కడా జన సంచారం లేదు

ఆ ఎండవేడికి తాళలేక అంతా తలుపులు బిగించుకుని ఇళ్ళల్లో సేద తీరుతున్నారు

ప్రతి ఇంటిముందు తాటాకు చలువ పందిళ్ళు వట్టి వ్రేళ్ళ తడికలో దర్శన మిస్తున్నాయ్

కాకులు కూడా ఎండకి సొమ్మసిల్లినట్లు చెట్ల గుబురుల్లో విశ్రాంతి తీసుకుంటున్నాయ్



# జీవితం చేజారిందా

దాహానికి మద్య మద్య కావ్ కావ్ అని అరుస్తూ రెక్కలు ఒకసారి విదిల్చి ఆ కొమ్మమించి ఈ కొమ్మమీదికి చిన్నగా ఎగురుతున్నాయి

వేసవికాలం ఇలా వచ్చిందో లేదో ఎర్రగా ఎండలు మండించేస్తున్నాయ్

ఆ ఎండలో చెమటలు దిగజార్చుకుంటూ అరమైలు దూరం నుంచి సైకిల్ తొక్కుతూ వస్తున్నాడు విశ్వేశ్వరయ్య

అయన మొఖం నెత్తురు పులిమినట్లు ఎర్రగా కందిపోయింది

కాస్త వయసు మీరటంచేత ఆయాసం గుండెల్లోంచి తన్నుకుని వస్తూంది

నుదుటిమించి చెమట దారలు కట్టింది అరికాళ్లనిండా చెమటలు పట్టి తొక్కుతూంటే పెడల్‌మించి పాదం జారిపోతోంది

వూపిరితీసి విడుస్తుంటే పాము బుస్సు మన్నట్లు శబ్దం వస్తూంది

అయన ప్రాణం వుస్సురుస్సు మంటూంది

శివశివా! ఈ ఏడాది ఎండలు మరీ దారుణంగా మండిపోతున్నాయ్ వానాకాలం మాత్రం వానలుండవ్ కాని ఎండాకాలం ఎండలు పేల్చేస్తున్నాయ్ కలికాలం అంటే ఇదేనేమో? అనుకొంటూ విసుగ్గా బ్రేక్‌వేసి రోడ్డు వారగా సైకిల్ దిగి స్టాండ్ వేశాడు విశ్వేశ్వరయ్య

నుదుటిమించి దారలుగా జారిపోతున్న చెమటని భుజంమీది ఉత్తరియంతో తుడుచుకొని ఉష్ అనుకొంటు చెట్టుకిందని వచ్చి నిల్చున్నాడు

దాహంతో ఆయనకి నోరు ఫిడచ కట్టుకుని పోతూంది

ఎదురుగా

రోడ్డుకి అవతల వైపు చెట్టుకింద పెద్ద కిళ్లీషాపు వుంది

మామిడి తోరణాలు కట్టినట్లు కొట్టుచుట్టూ రకరకాల న్యూస్ పేపర్లు పత్రికలు క్లిప్పులు బిగించబడి తాడుకి వ్రేలాడుతున్నాయ్

బయటివారికి కనిపించేలా ఆ కొట్లో చిన్న సైజు తెల్లని మిని ఫ్రిజ్ కూడా వుంది

ఆ వీదిలో ఏ మూల నిల్చున్నా దర్శనం ఇచ్చేలా తాటికాయంత అక్షరాలతో –

ఇచ్చట చల్లని ఐస్ సోడాలు, కూల్‌డ్రింకులు అమ్మబడును అన్న నల్లని పెద్ద బోర్డు కొట్టుముందు స్టాండ్‌కి వ్రేలాడుతూంది సోడా సోడా ఆంద్రా సోడా" అంటూ ఆ కొట్లోంచి స్టీరియోలో మోతగా ఓ సినిమాపాట కూడా వినిపిస్తూంది

ఎదురుగా కనిపిస్తున్న ఆ బోర్డుని చూసి చిరాగ్గా మొఖం తిప్పుకున్నాడు విశ్వేశ్వరయ్య




ఆఫీసునుంచి బయలుదేరే, ముందే– ఎందుకో కడుపులో గాబరాగా అనిపించి– అరవై పైసలు పెట్టి చల్లని నిమ్మకాయ సోడా కొట్టించుకొని తాగాడు

కాని క్షణంలో అదంతా ఆవిరైపోయింది

మళ్లీ విపరీతంగా దాహం' మొదలైంది

పది నిమిషాల కొకసారి అరవై పైసలు పెట్టి సోడా కొనుక్కొని తాగే స్థోమతు తన కెక్కడిది?

విశ్వేశ్వరయ్య తనలో తనే గొణుక్కున్నాడు కొద్ది క్షణాలు చెట్టుకింద చల్లగాలికి సేదదీరి తిరిగి సైకిల్ ఎక్కాడు

* * * * *

ఆ సైకిల్ పాతది

తొక్కుతూంటే దణదణ రేకుడబ్బా మ్రోగినట్లు శబ్దం వస్తూంది

దానికితోడు అస్తమానం చైన్ తెగిపోతూ వుంటుంది బ్రేకులు పనిచెయ్యవు పేరుకి మాత్రమే సైకిల్‌కి లైటు వుంది కాని వెలుగివ్వదు

నా జీవితంలాగే దాన్ది గుడ్డి వెలుగు అనుకుంటాడు విశ్వేశ్వరయ్య

ఆ సైకిల్‌కి సర్వీసింగ్ ఎక్కువ కనుక అస్తమానం టైర్లు పంచరు అవుతూ వుంటాయి

అయినా ఆ సైకిల్ మార్చి కొత్తది కొనుక్కొనే స్థోమతులేదు విశ్వేశ్వరయ్యకి

కొత్తది కొనాలంటే మాటలా?

ఎంత లేదన్నా వెయ్యి రూపాయిలు కావాలి ఓ ప్రక్క ఆడపిల్లలు ఎదిగి కూర్చున్నారు వాళ్ల పెళ్లిళ్లకి, పేరంటాళ్ళకి ఆ వెయ్యి వుంటే ఎంత ఆసరాగా వుంటుంది

సైకిల్ లేకపోయినా గడిచి పోతుంది కాని ఆడపిల్లల్ని అత్తింటికి అంపకాలు చెయ్యక పోతే, గడుస్తుందా? ఈ గుండెల మీద కుంపట్లు అవసరం అయితే ఈ సైకిల్‌ని కూడా అమ్మెయ్యాలి

అలా అనుకొంటాడు గాని నిజానికి విశ్వేశ్వరయ్యకి ఆ సైకిల్ అంటే ఎంతో ప్రేమ

అది లేకపోతే ఆయనకి ఒక్క క్షణం గడువదు

అరమైలు దూరంలో వున్న ఆఫీసుకి కాళ్ళు ఈడ్చుకొంటూ నడిచి వెళ్ళాలి

కాదంటే రానిబస్సుకోసం పడిగాపులు పడాలి

దానికంటే బ్రేకులు లేకపోయినా టైర్లు పంచరయినా, మాట మాటికి చైన్ తెగుతున్నా ఆ సైకిలే నయంకదా?

అందుకే–

ఎప్పటికప్పుడు పాడయిన బాగాలకి మాత్రం శ్రద్ధగా రిపేర్లు చేయిస్తూ వుంటాడు

శరీరంలో ఏ భాగాలకైనా జబ్బుచేస్తే చికిత్స చేయించుకుని నయం చేసుకోవటంలేదూ? ఇది అంతే!

ఆ సైకిల్ లేందే క్షణం కూడా గడవదు విశ్వేశ్వరయ్యకి

సైకిల్‌మీద ప్రపంచయాత్ర చెయ్యక పోయినా ఎలా చెయ్యాలో చక్కగా వివరించి చెప్పగలడు ఆ విషయాలన్నింటి గురించి పుస్తకం రాస్తే డాక్టరేట్ ఇవ్వాలి మరి!

పుట్టినప్పట్నుంచి అంతటి సైకిల్ చరిత్ర, అనుబవం వున్నాయి విశ్వేశ్వరయ్యకి

* * * * * *

కొంచెం నీరకావి పట్టిన పొందూరు ఖద్దరు పంచె కళ్ళు లాల్చ

సగం నెరసిన జుత్తు, బొద్దిగా వున్న మీసాలు

మెళ్లో తకిలితో ఒడికిన జంధ్యం దానికి ఒక చిన్న వెండి లింగకాయ నుదుట తెల్లగా విబూదిరేఖలు మద్య చిన్న గంధం బొట్టు

నోట్లో 'శివశివా' అన్న వూత పదం కళ్ళల్లో పేదరికానికి ప్రాతినిద్యం వహించే నిర్వేదం ఇవన్ని కలిస్తే విశ్వేశ్వరయ్య అవుతాడు

ఎత్తుగా తగిన లావుతో వుంటాడు విశ్వేశ్వరయ్య బాగా భారి విగ్రహం ఎర్రటి శరీరచ్ఛాయ కాని–

ఈతి బాధలకి నల్లగా కమిలినట్లు వుంటుంది

ఆయన పెదాలపై ఎప్పుడో గాని నవ్వు రాదు

వచ్చినా అతికించుకొన్నట్లే వుంటుంది

## జీవితం చేజారిందా

మధ్య తరగతి మందహాసం!

శంకరాభరణం సినిమా వచ్చాక ఆయన చిన్న కూతురు గిరిజ తండ్రికి శంకరశాస్త్రి అని పేరు పెట్టింది

విశ్వేశ్వరయ్య ఆఫీసు నుంచి ఇంటికి వస్తే గిరిజ--

అమ్మా! నాన్న వచ్చారు అనదు

శంకరశాస్త్రి వచ్చారా అని గబాల్న నాలిక కరుచుకొంటుంది

అప్పుడు కూడా విశ్వేశ్వరయ్య నవ్వడు

ఊఁ ? అని వూరుకుంటాడు బ్రతుకు మోయలేని భారం ఏదో ఆయన వదనంలో కనిపిస్తుంది

అలో వన్న మధ్యే ఎదరగాలిని తట్టుకొంటు ఫ్లై వే రోడు మించి మిట్ట మధ్యాహ్నం ఆ ఎండలో అరమైలు దూరం నుంచి ఆ షాకు సైకిల్ తొక్కుకొంటూ ఇంటికి వచ్చాడు విశ్వేశ్వరయ్య

ష్ శివశివా అంటు ఇంటి ముందు సైకిల్ దిగాడు

ఇనప వైరుతో అల్లిన గేటు తీసి లోపలికి వచ్చి అరుగువారగ ఉ ఎడి చెట్టు కింద సైకిల్ నిలిపి స్టాండ్ వేశాడు

ఇంటి ముందంత రకరకాల పూల మొక్కలు అందంగా పెరిగాయి

మామిడి చెట్టు నిలువెల్లా ఆకు కనిపించకుండా పూత పూసింది అక్కడక్కడా చిన్న చిన్న పిందెలు వ్రేలాడుతున్నాయి

ఇంటి వెనకాల చిన్న పెరడు రక రకాల కాయగూరల మొక్కలు ఆకుకూర మడులు చక్కగా పెరిగాయి

ఏ మాత్రం గేటు తెరిచి ఏమరుపాటుగా వున్నా మేకలు గొర్రెలు శుభ్రంగా మేసేస్తాయి

విశ్వేశ్వరయ్య గేటు వేసి దారగా నుదుట జారిపోతున్న చెమటని పై పంచతో తుడుచుకొంటూ పడిలు ఎక్కి -

అమ్మాయ్ సీతా! అంటు చిన్నగా కేకపెట్టి తలుపు మీద కొట్టాడు

ఆయన గొంతు దాహంతో ఎండుకు పోతూంది నీళ్ళలో మునిగి లేచినట్లు ఒంటి మీంచి దారగా చెమట జారిపోతూంది తొడుక్కున్న లాల్చి తడిసి ఒంటికి అతుక్కుని పోయింది

ఆ ఎర్రని ఎండలో అంత దూరం నుంచి సైకిల్ తొక్కుకుంటు రావటంతో ఆయాసం ఎగదన్నుకుని వస్తుంది

మొదటి పిలుపుకి లోపల్నించి ఎటువంటి సమాధానము రాలేదు

విశ్వేశ్వరయ్య కాస్త వూపిరి పీల్చుకుని తలుపు మీద గొళ్ళెంతో కొడుతూ

అమ్మాయ్ సీతా! అంటు గొంతు కాస్త హెచ్చించి మళ్ళి పిలుపు వేశాడు

పెరట్లో వేపచెట్టు కింద నవారు మంచంలో చల్లగాలికి హాయిగా పడుకుని నవల చదువుకుంటున్న గిరిజ పిలుపు విని గబాల్న లేచి చేతిలో పుస్తకం తలగడ కింద పెట్టింది రెండు అంగల్లో దూకినట్లు ఇంట్లోకి వచ్చి తలుపు తెరిచింది

చెమటలు దిగజారుకొంటూ ఎర్రగా కందిన మొఖంతో అంత ఎండలో వేళగాని వేళ హఠాత్తుగా ఆఫీసునుంచి వచ్చిన తండ్రిని చూస్తూనే ఒక్క క్షణం స్తంభీభూతురాలు అయ్యింది

శివశివా అంటు విశ్వేశ్వరయ్య లోపలికి వచ్చి ఎదురుగా వున్న పడక కుర్చీలో వాలుతూ తలెత్తి కూతురికేసి చూశాడు

ఏం చేస్తున్నారమ్మా లోపల? ఎన్నిసార్లు పిలిచినా పలకలేదే అన్నాడు మందలిస్తున్నట్లు

పెదవులు విడీ విడనట్లు గిరిజ చిన్నగా నవ్వింది ఆమె అలా నవ్వినపుడు బుగ్గ చిన్నగా సొట్ట పడింది

సారి నాన్న! నేను పెరట్లో వున్నాను వినిపించలేదు అయినా ఇప్పుడు. వచ్చారేంటి? ఆఫీసులేదా? అంటూ ఫ్యాన్ స్విచ్ వేసి ప్రక్కనే గూట్లో వున్న మట్టి కూజా లోంచి చల్లటి నీళ్ళు గ్లాసునిండా నింపి తండ్రికి అందించింది

విశ్వేశ్వరయ్య లాల్చి విప్పి కుర్చీపై వేశాడు

అర్జంటు పని వుండి వచ్చానమ్మా మీ అమ్మ ఇంట్లో లేదా?

నీళ్ళు తాగి ఖాళీ గ్లాసు కూతురికి అందించాడు

డాబా మీద ఒడియాలు పెడుతూంది నాన్న, పిలుస్తానుండు అంటూ లేడిలా ఛెంగున దూకి పెరట్లోకి వచ్చి ఇంటి వెనుక వైపుగ వున్న మెట్లెక్కి రెండు అంగల్లో డాబా మీదికి వచ్చింది

ఎర్రని ఎండలో కొంగు తలపై కప్పుకుని గుమ్మడికాయ వడియాలు పెడుతూంది సుబద్రమ్మ

సీత లక్ష్మి తల్లికి సహాయం చేస్తున్నారు

అమ్మా! శంకరశాస్త్రి వచ్చారు నిన్ను పిలుస్తున్నారు అర్జంట్ అంది నవ్వుతూ గిరిజ

సుబద్రమ్మ ఒక్క క్షణం తెల్లబోయి కూతురు మొఖంలోకి చూసింది

ఎండవేడికి ఆవిడ పచ్చటి వదనం ఎర్రగా కందింది

మొఖం మీద అక్కడక్కడా తెల్లని ముత్యాల్లా చెమట బిందువులు మెరుస్తున్నాయి

అదేమిటే? మీ నాన్న ఈ వేళగానివేళ ఎందుకు వచ్చినట్లు? ఆఫీసుకి

పెరట్లో బావి దగ్గరకు వెళ్ళి ఓ బొక్కెన నీళ్ళు చేది శుభ్రంగా కాళ్ళు చేతులు, మొఖం కడుక్కొని చెంగుతో మొఖం తుడుచుకొంటూ లోపలికి వచ్చింది

అప్పటికే విశ్వేశ్వరయ్య కాస్త సేద తీరి పంచె విడిచి అడ్డలుంగి కట్టుకుని కాళ్ళు కడుక్కుందుకు పెరట్లోకి వచ్చాడు.

గడపదగ్గరే ఎదురుపడ్డ భార్యని చూసి–

ఏమిటి? ఇంత ఎండలో ఒడియాలు పెడుతున్నారా? అన్నాడు ఆదరంగా

సుబద్రమ్మ చిన్నగా నవ్వింది

ఒడియాలు ఎండలో కాక వానలో పెట్టమంటారా ఏమిటి? అని మీరేమిటి? ఈ వేళప్పుడు వచ్చారు ఆపీసుకి వెళ్ళలేదా? లేక శలవు పెట్టారా? అంది

శలవు పెట్టాను శాస్త్రిగారు ఇందాక మా ఆపీసుకి వచ్చాడు. ఆయన మొన్న పట్నం వెళ్ళాట్ట మన శివరావు కనిపించి ఇవాళ సాయంత్రం ఆరుగంటలకి మన సీతని చూసుకుందుకు వాళ్ళని తీసుకొస్తున్నానని చెప్పాడుట ఈ విషయం శాస్త్రిగారు నిన్ననే మన ఇంటికివచ్చి చెపుదామనుకున్నాడుట కాని ఆయనకేదో అర్జంటు ముహూర్తాలుండి రాలేక పొయ్యాడట ప్రొద్దున్న పదకొండు గంటలకి మా ఆపీసుకి వచ్చి చెప్పాడు అందుకే ఈ పూట శలవు పెట్టి వచ్చేశాను ఇంక మీ ప్రయత్నాలు మీరు చూసుకోండి అన్నాడు తాపీగా

సుబద్రమ్మ బుగ్గలు నొక్కుకుంది







వెళ్ళలేదా ఏమిటి?

ఏమో! అవన్ని నాకు తెలివ్వ ముందు నువ్వు కిందికి వెళ్ళు మళ్ళి శంకరశాస్త్రిగారికి కోపం వస్తుంది అని నవ్వి–

అబ్బ! ఇంత ఎండలో ఎలా కూర్చున్నారో అంది మొగం చిట్లిస్తూ గిరిజ

అవును మరి నువ్వంటే మగరాయుడివి మంచం ఎక్కి పుస్తకం పట్టుకున్నా గడుస్తుంది కాని మా కెల్లా సాగుతుంది? నా బదులు నువ్వు ఇలా కూర్చుని ఆ కాస్త పిండి వడియాలు పెట్టు ఆడపిల్లవికాదూ? అంది కసురుతూ సుభద్రమ్మ ప్రక్కనే వున్న బకెట్ నీళ్ళలో చేతులు కడుగుకొంది

ఆ మాటలతో గిరిజ మొఖం వెగటించింది

అమ్మో! ఆ పాడుపని మాత్రం నాకు చెప్పకు అంటూ తల్లి కంటిముందే కిందికి పరిగెత్తింది గిరిజ

పాడుపనా? రేపు వేయించినప్పుడు తిను చేతులు విరగ్గొడతాను అంటూ లేచి–

ఒసేయ్ సీతా! ఆ కాస్త పిండి మీరిద్దరూ పెట్టేసి రండి మీ నాన్న ఈ వేళప్పుడు ఎందుకొచ్చారో మళ్ళి ఆలస్యం అయితే మండిపడతారు అంటూ లేచి నిల్చుని అరచేత్తో నడుం సవరదీసుకుంటు కిందికి వచ్చింది

ఏమిటి చోద్యం? ఆడపిల్ల గలవాళ్ళం ఇంత హఠాత్తుగా చెప్తే ఎలాగ అనుకున్నారు? మన మేమన్నా జమిందార్లమా?

విశ్వేశ్వరయ్య అభయం ఇస్తున్నట్లు తల అటు – ఇటు తిప్పాడు

నువ్వేం ఖంగారుపడకు ఆర్భాటాలు అవ్వి ఏమి చెయ్యవద్దని కబురు పంపారు కతికితే అతకదుట పిల్లని చూసుకుందుకు రావటం ఆనవాయితీ గనక ఏదో లాంఛనంగా వస్తున్నారట అంతే! అన్నాడు

అయితే మాత్రం? ఇంటికి వచ్చిన పెద్ద మనుషులకి ఏదో ఇంత తపికూడా పెట్టకుండా ఎలా పంపుతాం వాళ్ళు తిన్నా తినక పోయినా మర్యాద చెయ్యటం మన ధ్యేయం కదా? వియ్యాలవారా? మరొకటా? ఇంతకీ ఎంతమంది వస్తున్నారట!?'

ఎంత మందో నా? మన శాస్త్రిగారితో కల్సి ఐదుగురు అంతే!

ఊఁ నిట్టూర్చింది సుబద్రమ్మ ఆవిడ నీళ్ళతో మొఖం కడుక్కోవటంతో నుదుటి కుంకుమ కరిగి ముక్కు మీదికి జారింది

సుభద్రమ్మ కాస్త పొట్టిగా లావుగా వుంటుంది

గుండ్రటి మొఖం

పచ్చగా పసుపు రాసినట్టు మంచి శరీరచ్ఛాయ కలువ రేకుల్లా నల్లటి కాటుక కళ్ళు మంచి కళ గల మొఖం

## జీవితం చేజారిందా

ఏ ఆభరణాలు లేకపోయినా ఒక రకమైన అమాయకత్వంతో కూడిన పవిత్ర భావం ఏదో ఆవిడ వదనంలో ద్యోతకమవుతూ వుంటుంది

చెవులకి నీరుకావి పట్టిన దుద్దులు మెడలో పసుపు రాసిన నూలుతాడు దానికి చింతాకు మంగళసూత్రాలు మధ్య చిన్న వెండి లింగకాయ రెండు వరసల సన్నని నల్లపూసల దండ

చేతులకి నిండుగా మట్టిగాజులు

సగం నెరిసిన జుత్తుని చిన్న వేలుముడి వేసుకుంటుంది

ఆవిడ ఇంట్లో ఎప్పుడూ అతుకులు వేసిన చీరే కట్టుకుంటుంది

అతుకులుగాని చిరుగులుగాని లేని చీర ఏదన్నా వుంటే దాన్ని చక్కగా వుతికి బిళ్ళ మడతలు పెట్టి– ఇంత మంచి చీర ఇంట్లో ఎందుకు? – అనుకుంటు భద్రంగా పెట్టోదాస్తుంది

ఆడపిల్లల తల్లి కావటంతో ఓ మంచి చీర కొన్నా చిన్నం ఎత్తు నగ చేయించినా అది ఆవిడదాకా రాదు

పేదరికానికి ప్రతినిధిలా, జీవితాన్ని కాచి వడగట్టిన వేదాంతిలా నిర్వికారంగా, నిరాడంబరంగా వుంటుంది సుభద్రమ్మ

కాని–

ఆవిడ వదనంలో తేజస్సు, ఒక విధమైన పవిత్రత చూపరుల్ని కట్టి పడేస్తాయి

గృహిణి అన్న పదానికి ఆవిడ్ని చూస్తే సరి అయిన నిర్వచనం కనిపిస్తుంది

పెళ్ళికొడుకు తల్లి తండ్రి క్రిందటి వారంలో అనుకోకుండా స్వగ్రామం నుంచి కొడుకు దగ్గరికి పట్నం వచ్చారట సరే ఇవ్వాళ మంచి రోజని ఇటు వస్తున్నట్టున్నారు అంటూ చెప్పి తువ్వాలు అందుకుని పెరట్లోకి నడిచాడు విశ్వేశ్వరయ్య

సుభద్రమ్మ చిన్నగా నిట్టూర్చింది

ఊఁ సరే కుదిరినా కుదరక పోయినా ఈ తతంగం తప్పదు కదా? కాస్త నిస్పృహతో వంట గదిలోకి నడిచింది

ఉదయం భోజనం కాగానే వడియాల పని పెట్టుకొంది ఏదో ఆ పని కాస్తా అయ్యింది కొంచెం సేపు విశ్రాంతిగ నడుం వాలుద్దాం అనుకొంది

కాని ఇంతలో భర్త తెచ్చిన వార్తతో ఆవిడ మనసంతా అస్థిమితంగా తయారయ్యింది

పిల్లని చూసుకుందుకు వస్తున్నారంటే కడుపులో ఖంగారు మొదలయ్యింది

ఈ సంబంధం మీద చాలా ఆశలు పెట్టుకున్నారు



కాని ఆ ఈశ్వరుడి దయ ఎలా వుందో మరి?

వంటగదిలోకి వచ్చి స్టౌ వెలిగించి గిన్నెతో కాఫీకి నీళ్ళు పడేసింది

అల్మారాలోంచి సెనగపిండి డబ్బా జల్లెడ బయటికి తీసింది

పీట వాల్చుకుని కూర్చుంటూ–

ఒసేయ్ గిరిజా! అంటు కేక వేసింది

గిరిజ అవటానికి ఆడపిల్లే అయినా ఆ లక్షణాలు తక్కువ ఆ అమ్మాయికి ఇంటి పన్లు అంటే మహా చిరాకు నవలలు, సినిమాలపిచ్చి చేతిలో పుస్తకం వుంటే చాలు ఆకలి నిద్ర కూడా తెలియవు

పెరట్లో చల్లగాలికి మంచంలో పడుక్కొని హారర్ నవల చదువుకొంటున్న గిరిజకి తల్లి పిలుపు వినిపించింది

ఇంకొకప్పుడైతే పుస్తకం వదిలి లేవకపోను కాని ఇప్పుడు తండ్రి ఇంట్లో వున్నాడు అందుకే గబాల్న పుస్తకం పక్కకి పెట్టి లేచి వంట గదిలోకి వచ్చింది

సెనగపిండి జల్లెడ పడుతున్న తల్లిని చూసి–

హాయ్ ఏంటి మమ్? టిఫిన్ చేస్తున్నావా? వుల్లిపాయ పకోడీలు తిని చాలా రోజులు అయ్యింది అంది గారంగా

ఆఁ నీ కోసమే వండుతున్నాను ఇంట్లో వీసం ఎత్తు పనికి కల్సిరావుగాని తింటానికి మాత్రం అందరికంటే ముందు తయారవుతావే నోరు మూసుకుని ఆ కాపిలు కలిపి అందరికి ఇవ్వు ఆ తరువాత కాస్త గదులన్ని శీఘ్రంగా తుడిచి సర్దు

సాయంత్రం సీతక్కని చూసుకుందుకు వాళ్ళు వస్తున్నారుట మైసూర్‌పాక్ చేసి కాస్త మిక్చర్ కలుపుతాను నీకూ పెడతాలే అంది చిరునవ్వుతో

గిరిజ హుషారుగా కళ్ళు తిప్పింది

ఓహో అదా హడావుడి అందుకన్నమాట నాన్న వచ్చింది అమ్మా అయినా నాకు తెలియక అడుగుతాను ఓ ప్రశ్నకి జవాబు చెప్పు

!?

నేను తింటానికి ఏదన్నా చేసి పెట్టమని అడిగితే తిడతావు ఒంట్లో ఓపిక లేదనో ఇంట్లో అదిలేదు ఇదిలేదనో విసుక్కుంటావ్ కాని పెళ్ళి చూపులకి వచ్చేవాళ్ళకి మాత్రం వద్దన్నా పెడతావ్ నానా హైరానాపడి ఇలా స్వీట్లు– హాట్లు చెయ్యటం ఎందుకు? మనం ఏదన్నా స్వీట్స్ షాపు నడుపుతున్నామా? అక్కని చూసుకుందుకు ఇప్పటికి ఎందరో వచ్చారు కదా మైసూర్‌పాక్‌లూ, లడ్లు అంతా మింగిపోయిన వాళ్ళేగాని ఒక్క సంబంధం అయినా కుదిరిందా చెప్పు?

ఉఫ్ నిట్టూర్చింది సుభద్రమ్మ

ఏం చేస్తాం తల్లి? దేనికైనా యోగం వుండాలి ఇంకా దానికి కళ్యాణ ఘడియ రాలేదు

మరి అలాంటప్పుడు ఈ మైసూర్‌పాకాలు, మిక్చర్లు ఎందుకు వాళ్ళ మొఖాన పెట్టటం? మనమేమో అన్నంలో నూని వేసుకోవటం, కాఫీలో బెల్లం కలుపుకోవటం వాళ్ళకి మాత్రం ఘుమఘుమ నెయ్యిలు, పంచదార్లు అనవసరపు దండగ ఖర్చు ఇందాకా డాబా మీద పిండి వడియాలు, చల్ల మిరపకాయలు పెట్టావ్ కదా? అవి కాసిన్ని వేయించి ఆ వచ్చే వాళ్ళకి పళ్ళెంలో పెట్టి తలా రెండు ఇయ్యి అంది ఎగసెక్కెంగా

ఆంత నిర్వేదంలో నూ సుభద్రమ్మ ఫక్కుమని నవ్వింది

అలాగే తల్లి ఏదో చదువుకున్న దానివి నువ్వు చెప్తున్నావు గనుక రేపు నిన్నే చూసుకుందుకు ఎవరైనా వస్తే వడియాలు, అప్పడాలు, చల్ల మిరపకాయలు వేయించి వాళ్ళకి టిఫిన్ పెడతాలే అంది

గిరిజ అందంగా సిగ్గు పడింది ఆమె కనురెప్పలు కిందికి వాలాయి ఆపాటి పెళ్ళి ప్రస్తావనకే ఆమె తెల్లని చెక్కిళ్ళు ఎర్రగా కందాయి

చ పో నేనసలు పెళ్ళే చేసుకోను ' అంది

ఆఁ .. ఒకప్పుడు అందరం అలా అన్నవాళ్ళమే ఇప్పుడు ఇలా కూతుకు పొయ్యాం అంటూ సుభద్రమ్మ ఇంకా ఏదో అనబోయేంతలో లక్ష్మి, సీత డాబా మీంచి దిగి పెరట్లో బావి దగ్గర గిన్నెలు కడిగి వంట గదిలో పెట్టటానికి వచ్చారు

సాయంత్రం సీతని చూసుకుందుకు వస్తున్నారు అనగానే అందరిలో ఒక విధమైన వుత్సాహం ప్రవేశించింది (ఇంకా ఉంది)

# ఇద్దరూ ఉద్యోగస్తులైతే...!

## కొత్తశీర్షిక



శ్రీమతి మమతా అనురాగ్

ఏ బ్యాంకులోనో మరే ఇతర కంపెనీలలో గాని ఉద్యోగం చేస్తే సాయంత్రం ఐదవ్వగానే ఇంటి కొచ్చెయ్యవచ్చు కాని పోలీసు ఉద్యోగం అలా కుదరదు అర్ధరాత్రి కూడా పరిగెత్తాల్సిన అవసరం ఉంటుంది అటు ప్రజలకు, ఇటు ప్రభుత్వానికి సమాదానం చెప్పుకోవాలి' ఇంత బాధ్యతాయుతమైన ఉద్యోగం మరొకటి ఉండదేమో అనిపిస్తుంది అన్నారు శ్రీమతి మమతా అనురాగ్ అసిస్టెంట్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్

# కత్తిమీద సాములాంటిది మా ఉద్యోగం!

విజయవాడ

ఎమ్ ఏ సంస్కృతం చదివిన మమత ఐ పి ఎస్ కు వెళ్లారు 'మా ఇంట్లో అందరూ డాక్టర్లు మా నాన్నగారు డాక్టర్ గోపాలరెడ్డిగారు వరంగల్‌లో ప్రభుత్వ ఆస్పత్రిలో రీజినల్ డైరెక్టరుగా ఉంటున్నారు నాకుమటుకు ఒక ఉన్నతమైన ఉద్యోగంలో అందరిచేతా గౌరవాభినందనలు అందుకోవాలన్న కోరిక చిన్నప్పటి నుండి అది నెరవేరాలంటే ఐ ఏ ఎస్ కైనా, లేదా ఐ పి ఎస్ కన్నా వెళ్లాలి రెండోది సెలక్ట్ చేసుకున్నాను అన్నారు శ్రీమతి మమత?

## ప్రేమ వివాహం

'ఐ పి ఎస్ ట్రైనింగ్‌లో ఉండగా శ్రీ అనురాగ్‌శర్మతో పరిచయం అయ్యింది ఆయన సాధు స్వభావి మా స్నేహం ప్రేమగామారి– వివాహానికి దారితీసింది శ్రీ అనురాగ్‌శర్మ ప్రస్తుతం నిర్మల్ ఎ ఎస్ పి గా పని చేస్తున్నారు' మీకు అభిమానులు దురభిమానులు ఎవరైనా ఉన్నారా?' అని అడిగితే రెండూ మావారే' అన్నారు మమత నవ్వుతూ!

–1985 నవంబరులో మా వివాహం జరిగింది రెండు నెలలు మాత్రం శలవు పెట్టాను ట్రైనింగ్ పూర్తవగానే మొదటి పోస్టింగ్ ఖమ్మం వేశారు. నన్ను అన్నారు మమత.

మరి నూతన దంపతులకి ఎడబాటు కష్టంగాలేదా?

అవన్నీ ఉంటాయనే తెలిసి వివాహం చేసుకున్నాం కాబట్టి అంత బాధగాలేదు ఇద్దరం ఒకే చోట ఉద్యోగం చెయ్యడం ఐ పి ఎస్ లో కుదరదు ఇహనేను లూప్‌లైనుకు ట్రై చేసుకుంటే తప్ప' అంతవరకూ మేము సందేశాలే' అన్నారామె

## గృహిణిగా...'

పగలంతా అలిసిపోయొచ్చే భర్తకు సేవలు చెయడంలోను పిల్లల్ని సంరక్షించుకోవడంలోను ఒక భార్య చాలా తృప్తిని పొందుతుంది కాని మాకు అవి కుదరవు ప్రస్తుతానికి మా వారికి నచ్చే వంటలు చెయ్యడం మాత్రం నేర్చుకున్నాను అది 'రాజస్థాన్ వంటకాలు నార్త్‌ఇండియన్ స్టైల్లో శాకాహార భోజనమే ఎక్కువగా వండుతాను అన్నారు శ్రీమతి మమతా అనురాగ్

'పేరు ప్రఖ్యాతులు గడించాలని ఎవరైనా అనుకుంటారు ప్రజాసేవయే కర్తవ్యంగా నీతి నిజాయితీలతో ఉద్యోగం చేసి ప్రజల మన్ననలందుకున్న ఆపిసర్లు చాలా అరుదుగా ఉంటారు నాకూ ఆ పేరు ప్రఖ్యాతులు రావాలని కోరుకుంటున్నాను స్వార్థం ఈ విధంగా ఉంటే పరవాలేదండోయ్!'



శ్రీ అనురాగ్, శ్రీమతి మమత

మరి మీ వారికి ?

నాకొస్తే ఆయన కొచ్చినట్లే కదండీ ? ఆయన నాకంటే ఒక మెట్టు ఎక్కువేలెండి'

## లంచంగురించి మీ అభిప్రాయం?

ఏ డిపార్టుమెంటులో లేదంటారు ఈ లంచం! కాకపోతే పోలీస్ డిపార్ట్‌మెంటులో తొందరగా పబ్లిసిటీ వస్తుంది ఏ ఆపీసరైనా లంచం తీసుకునేదీ లేనిదీ వచ్చిన పదిరోజుల్లో తెలిసిపోతుంది నామటుకు నేను ముక్కుకు సూటిగా పోతున్నాను ముఖ్యంగా విజయవాడలో చాలా రాజకీయ వత్తిడులు వస్తూ ఉంటాయి అన్నీ సమర్థించటం చాలా కష్టం! నా మనసుకు న్యాయ మనిపించింది చేసితీరుతాను దానికి హరిహరాదులు అడ్డువచ్చినా ఆగను! అన్నారు శ్రీమతి మమత?

## ప్రజా సంబంధాలు

పోలీసులకు ప్రజలకుస్నేహ సంబంధాలు చాలా అవసరం! విజయవాడ వచ్చింతరువాత పబ్లిక్ రిలేషన్స్‌కున్న ప్రాముఖ్యత తెలుసుకున్నాను కష్టాల్లో ఉన్న వ్యక్తికి న్యాయం చేస్తే పదిమందికి చెప్పుకుంటాడు నేనో పెద్ద ఆపిసర్ని బోడి నిన్ను కలిసేదేమిటనుకుంటే– అలాగే ఉంటుంది మనమీద ఇతరుల అభిప్రాయం కూడా ఏమంటారు? అన్నదామె

## అభిప్రాయ బేధాలు?

మీకూ మీ భార్యకు వృత్తిరీత్యా ఏవైనా అభిప్రాయబేధాలు వస్తుంటాయా? అని శ్రీ అనురాగ్‌శర్మని అడిగితే!

ఉన్నట్టుండి నామీద పడ్డారు 'షి ఈజ్ మెర్స్యూర్స్ ఇన్‌హర్ జాబ్' కేవలం సలహాలు మాత్రం అవసరమైతే ఇస్తాను నో మోర్ కామెంట్స్ అంటూ ఇప్పుడిప్పుడే నేర్చుకుంటున్న తెలుగులో అందంగా సమాదానం చెప్పారు శ్రీ అనురాగ్!

మరి మీకు పుట్టబోయే పిల్లల్ని కూడా ఐ పి ఎస్ కు పంపిస్తారా ?

'పెళ్ళయ్యి మూడు నెలలే కదండీ అయ్యింది వారి ఇష్టానుసారం జరుగుతుంది ప్రస్తుతం మా ఉద్యోగాలే మా పిల్లలు అన్నారు శ్రీమతి మమతా అనురాగ్

భార్యా భర్తలిద్దరూ ఐ పి ఎస్ ఆపీసర్లవ్వడం చాలా అరుదు అయితే మాత్రం ఒకేచోట కలిసి ఉండటం అసాధ్యం! కర్తవ్యమే తమ లక్ష్యంగా భావించి చిన్న వయసులోనే మంచి పేరు తెచ్చుకుంటున్న శ్రీమతి మమతా శ్రీ అనురాగ్ శర్మలను అభినందించాలి'

–కృష్ణాజీ

# చేపలు

## వక్కలంక పద్మావతి

ఆ రోజు ఉదయం నుంచే వర్షం కురవటం మొదలయ్యింది అప్పటివరకు ముడుచుకుని పడుకున్న జానయ్య ఉన్నట్టుండి లేచి తనవలను పొడుగాటి వెదరు కర్రను బయటికి తీసాడు

గూట్లో చుట్టిపెట్టిన ప్లాస్టిక్ వైరును తీసి పొడుగ్గా చిక్కు విడదీసి, ఒక మొదలు కర్రకు చివరున్న మేకుకి చుట్టి, మిగతాది ఓ బెత్తెడం వెడల్పున్న చెక్క ముక్కకి చుట్టి సంచిలో పడేసి సంచిని కర్రకి తగిలించి గోడవారగా నిలబెట్టాడు

జానయ్య చర్యల్ని గమనిస్తున్న తల్లి ఇక వూరుకోలేకపోయింది

ఓరి జానయ్యా! నీకు దెయ్యమేదో పట్టినట్టున్నాది ఓ పక్క వాన జోరుమని కురుత్తుంటే సేపలు పడతా సేపలు పడతానని 'యీ రంగమాడతన్నావ్ నీకేటి మతిగాని పోలేదు గందా! అంది

తల్లి మాటలకి జానయ్య నవ్వుకున్నాడు

'దీనికేటి తెలుస్తది తన యవ్వారం తను పట్టేది సేపలు కాదు, సేపలాంటి పిల్ల సీతని ఇయాల ఏటొడ్డు కొత్తానని మాటిచ్చింది పైగా పొద్దేల అయ్యేదాకా నాతోనే వూసులు చెప్తానని ఆశ పెట్టినాది ఈ యిషయం దీనికెట్టా చెప్పాలంట పిచ్చి నా తల్లి' అనుకున్నాడు మనసులో

పైకి మాత్రం, అదికాదెహె, యీయాల గౌరయ్య గాడి బాబి సంతకెల్తన్నారు అళ్ళులేకపోతే ఎట్టో సేపలన్నీ మనియ్యేవే, సందెల టౌనెట్టికెల్లి అమ్మితే డబ్బులు బాగా ముడతయ్ అంటూ తల్లి సమాధానం కోసం కూడా చూడకుండా గబగబ జల్లిబుట్ట చంకలో పెట్టుకుని, వెదురు కర్ర భుజాన తగిలించుకుని గుడిసెలోంచి బయటకు నడిచాడు

ఏటికొడ్డుకి వెళ్ళేసరికి అక్కడ సత ఎదురు చూస్తూ కనిపించింది ఆమెను చూడగానే అతని మనసు ఆనందంతో ఉక్కిరి బిక్కిరయింది గుండెల్లో ఒకలాంటి గుబులు రెండంగల్లో సతని చేరుకుని రెండుచేతుల్తో ఆమెను బలంగా చుట్టేసి ఎదకు హత్తుకోవాలని, నిలువెల్లా ముద్దాడాలని ఎన్నో వూహించేశాడు అరక్షణంలో

ఆమెకు కాస్త దూరంగా ఒకరిద్దరు ఆడవాళ్ళు బట్టలుతుకుతూ కనిపించటంతో తన ఆలోచనలకు అప్పటికి ఫుల్‌స్టాప్ పెట్టాడు

సీత అతన్ని క్రీగంట చూసి నవ్వింది ఆ నవ్వుకి జానయ్య గుండె జల్లుమంది ఆత్రంగా వెళ్ళి పక్కనే ఉన్న రాయిమీద కూర్చోబోయాడు

చివుక్కున తలతిప్పి, అతన్ని తీక్షణంగా చూస్తూ ఏటా దూకుడు కాసంత దూరంగా కూకో! అవకాడ ఎరిగినోళ్ళున్నారు అంది సీత

ఆ మాటలు అతని ఆవేశపు పొంగుమీద బురదనీళ్ళు చల్లినట్లయ్యింది

ఓరి, నీయవ్వ అల్లున్నారు యీల్లున్నా-రంటావనే గదే ఇన్నాళ్ళూ ఆగింది ఇకనావల్ల కాదెహె అంటూ జల్లి పక్కనపెట్టి వెదురుకర్ర క్రిందపెట్టాడు

అతనికేం తోచటంలేదు రాతిక్రింద కొద్దిగామట్టిని వేలితో గుచ్చి పైకితీసి, మట్టిలో ముడుచుకు పడుకున్న లావుపాటి ఎర్రలను బైటకి లాగాడు బైటపడ్డ ఎర్రలు ఒళ్లంతా విరుచుకుని గట్టిగా వూపిరి పీల్చుకుని పెదకొండ చిలువల్లా అక్కడనుంచి సాగిపోవటం గమనించిన జానయ్య తపుక్కున నొక్కి కర్రచివర సూదికేసి గుచ్చేశాడు శిక్ష విధిస్తున్నట్టు

బాధతో విలవిల్లాడిన ఎర్రలన్నీ చచ్చి వ్రేలాడిపోయాయి మెల్లగా నీళ్లల్లోకి దించేశాడు వాటిని జానయ్య

అలవాటైన చర్యగా ఆ పనులు చేస్తున్నాడే గానీ జానయ్య మనసంతా సీతమీదే వుంది విసుగ్గా అవతల బట్టలుతుకుతున్న వాళ్లని చూస్తునే వున్నాడు ఇష్షో ఇష్షో అంటూ వాళ్ళు చేసే శబ్దం లయబద్ధంగా రాతిమీద బట్టలుతికే చప్పుడు అతన్ని మరింత రెచ్చగొడుతున్నాయి

సీత చాటుగా నవ్వుకుంది ఆమె చేపలు పట్టటానికి కూర్చుని గంటపైనే కావస్తుంది ఆమె తండ్రి తెల్లారగట్టే ఏటిలో తిరి అమర్చి వెళ్ళాడు రెండు మూడు గంటలు చూసి దాన్ని తిరగేసి చేపలన్నీ తట్టలోకి ఎత్తమని సీతకి చెప్పి మరీ వెళ్ళాడు

కానీ జానయ్య వూసులో పడి సీత ఆ విషయమే మర్చిపోయింది అతన్ని చూస్తే చాలు ఆమె మనసు మనసులోనే వుండదు క్రీగంట అతన్ని చూస్తూ ఆలోచిస్తుంది

"మడిసిని సూత్తే చాలు ఆడి సేతులూరుకోవు పొద్దస్తమానూ ఏటేటో సెప్తుంటాడు తల్చుకుంటే వొళ్ళంతా పులకరిస్తుంది అనుకుంటున్న సీత కళ్ళు అదోలాటి మెరుపు సంతరించుకుని బుగ్గలు ఎరుపెక్కి, నల్లరాయిలా మెరిశాయి

జానయ్య వర్షం చినుకుల్లో తడుస్తూ దూరంగా ఒంటరిగా కూర్చోటం ఆమెకి అయిష్టంగానే వుంది కానీ అవతల బట్టలుతికే ఆడవాళ్ళు చూస్తున్నారనే బిడియం– అతన్ని దూరంగా వుంచేలా చేసింది

అలా ఓ పావుగంట గడిచింది

బట్ట లుతకడం కాగానే వాళ్ళంతా మూటలు తలమీద పెట్టుకునీ వెళ్ళిపోవడానికి ఉద్యుక్తులవటం చూసి ఇద్దరి మనసులూ చల్లబడ్డాయి

వాళ్ళలా వెళ్ళిపోవటం ఆలస్యం చేతి కర్ర అవతల పడేసి ఆమె తాటాకు గొడుగులోకి ఛెంగున దూకాడు జానయ్య

అతని స్పర్శ వెచ్చగా తగిలి ఒళ్ళంతా మత్తుగా అనిపించింది సీతకి జానయ్య సీత కళ్ళల్లోకి చూస్తూ, ఎడమ చేత్తో ఆమె నడుమును అదిమి చుట్టేశాడు

అతని కౌగిట్లో గువ్వలా ఇమిడిపోయిన సీతకి కాలం తెలియ లేదు ఎంతసేపలా ఉండిపోయిందో కానీ, ఉన్నట్టుండి పెద్ద కేక పెట్టింది కొంప మునిగిపోయింది మావోయ్ అంటూ!

ఏటి! దెయ్యం పట్టినట్టు ఆ అరుపు మునిగేది కొంపకాదు మనిద్దరం మునగాల సొర్గంలో అన్నాడు ఆమె చిగురు చెంపమీద చిటికెన వేలితో మీటుతూ

అయ్యో! సరసాలాడకు మావా! మా అయ్య ఏట్లో తిరి బైటికి తీసి సేపలు గంపలో కెత్తి కెల్లి టౌకుమారకెట్లో అమ్మి సొమ్ము తెమ్మన్నాడు నీ వూసులో పడి ఆ పనే మర్చిపోయాను అంది కంగారు-పడుతూ

జానయ్యకు అవేం విన్పించటం లేదు ఆమె కళ్ళల్లో అందం, అమాంతం తాగేశేలా చూస్తున్నాడు

అతని దోరణికి వళ్ళు మండిపోతుంది సీతకి అతని వీపుమీద ఒక్కటి చరిచింది

ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చి పడ్డాడతను

ఛీ! ఎదవగోల పండగపూట కూడా పాత మొగుడే అని, ఏటే సీతా! సేపలు, సేపలు, సేపలంటావు! అయన్నీ అమ్మితే ఎంతొస్తాదో చెప్పెహె! నేనిస్తా! అన్నాడు మీసం మెలేస్తూ

నీ మాటలు, ఇవిగో ఈ ఏట్లో నీళ్ళు లాగానే కొట్టుకు పోతాయి ముందా తిరి తీసి సేపలు తట్టలో ఎయ్యి తర్వాత సూస్తా నీ కత' అంది కళ్ళు చికిలిస్తూ

జానయ్య నీళ్ళలోకి దిగి, తిరి నాలుగు వైపులా నట్లు విడదీసి దాన్ని మెల్లగా ఒడ్డుకి తీసుకొచ్చి వెల్లికిలా తిప్పాడు అలా తిప్పు తున్నప్పుడు ఓ మూలకట్లు వూడిపోయి సగం చేపలు జల్లిలోంచి టింగు టింగున నీళ్ళలోకి దూకేశాయి పరవశంతో



తీరా గంపలోకి చూస్తే సగానికి కూడా లేవు చేపలు

వర్షం పెద్దదయింది ఎంకి గంప నెత్తిన పెట్టుకుని పక్కనున్న మామిడితోపులోకి పరుగు తీసింది జానయ్య తన సరంజామా అక్కడే వదిలి తాటాకు గొడుగుతో ఎంకి వెంట పరుగు తీశాడు

ఇద్దరూ మామిడితోపుకి తూర్పు వేపున మోటారు కోసం వేసిన షెడ్డుకి చేరారు

ఒళ్ళంతా తడిసి ఎంకి మెరిసిపోతోంది ఆమె అందాన్ని కరువుతీరా కళ్ళారా చూస్తూ మైమరచిపోతున్నాడు జానయ్య

ఆ వర్షంలో మామిడిచెట్లన్నీ ఏదో నేరం చేసినట్టు నిలబడి శిక్ష అనుభవిస్తున్నాయి ఆకాశం వుండుండి ఉరుముతోంది షెడ్డు ఇంజను అంత క్రితం పంపూ పని చేసిందేమో వేడిగా ఆవిరి చిమ్ముతోంది

దాని పక్కనే వున్న తట్టలో చేపలు తమకేదో విపత్తు సంభవించినట్టుగా భయంతో క్షణక్షణానికి బిగుసుకు పోతున్నాయి

అలా రెండు గంటలు విసుగు లేకుండా ఆకాశం వర్షించి అలసి పోయినట్టుగా తెరిపిచ్చింది

అయ్యో! ఇంత బేగే ఎలిసి పోయిందేటి వాన ఇంకాసేపు కురిస్తే ఏటో నష్టం ఎంకి కళ్ళల్లోకి సూత్తా కూసో వచ్చు అన్నాడు కొంటెగా ఆమెను చూస్తూ

మనువాడకుండా వేషాలేయకు మా అయ్యతో చెప్పి లగ్గాలెట్టించుకో అంది

అతనేదో అనబోయేంతలో మళ్ళా కెవ్వున అరచినంత పని చేసింది ఎంకి

ఉలిక్కిపడ్డాడు జానయ్య ఏమాలి ఏటయ్యిందే అంటూ పక్కకొచ్చి కూర్చున్నాడు

చేపల తట్ట ఇవతలకి లాగి ఏటయ్యిందంటావేటి మావా! నీ యావలో పడి ఈటి మొహం సూడలేదు సచ్చిపోయాయి మా అయ్య నా పెళ్ళి చేసేత్తాడు ఓరి దేవుడో! అంటూ సన్నగా రాగం తీయటం మొదలుపెట్టింది ఎంకి

జానయ్య చేపలు చేతిలోకి తీసుకుని చూశాడు

ఇందాక సేపలికి డబ్బులిత్తానన్నావుగా మావా! ఇప్పుడియ్యి సేపలు ఎట్టాగ పారేసి మా అయ్యకి సేపలమ్మి డబ్బులు తెచ్చానని చెప్తాను అంది




గుటకలు మింగాడు జానయ్య ఓర్నీ ఏదో నిన్ను ఒంటిగా చూసిన మైకంలో డబ్బు లిత్తాన్నాను గానీ, నాకాడెక్కడియ్యే అన్ని డబ్బులు అన్నాడు

ఓరి, ఎదవ సచ్చినోడా! పేమ పేమ అని ఎర్రిదాన్ని సేశావు ఏయేయో మాటలు చెప్పావు ఇప్పుడు నా గతేంటి సెప్పు అంటూ గొడవ చేసింది సీత

అమె ఏడుపు భరించలేక చెవులు గట్టిగా మూసుకున్నాడు చేతులు ఇవతలికి తీస్తే చాలు నీ జిమ్మడ, నిన్ను ఏట్లో తగలయ్య అంటూ ఏవేవో తిట్లు వినిపిస్తున్నాయి ఆ తిట్లు వినలేక అమె చెయ్యి పట్టుకుని అన్నాడు

ఈ చేపలన్నీ అమ్మి సొమ్ము చేసివ్వకపోతే ఈ జానయ్య మీసం గొరిగించేసుకో పద నాతోరా అంటూ తోపులోంచి టౌన్ వైపుకు దారి తీశారిద్దరూ!

* * * *

చేపల మార్కెట్లో రద్దీ అంతగా లేదు అప్పటికి టైము పదకొండు దాటిపోయింది

సీత దిగులు పడిపోయింది ఆ సమయంలో వచ్చినందుకు దానికి తోడు చచ్చి బిగుసుకున్న చేపలు తనని వెక్కిరిస్తున్నట్టనిపించాయి ఆమెకు

ఆమె కళ్ళలో భయాన్ని గమనించిన జానయ్య నవ్వుకున్నాడు పట్నంలో అమ్మకానికి వేళాపాళా వుండదనీ, ఏ హోటలు వాళ్ళో, పార్టీలు చేసుకునే వాళ్ళో ఎవరో ఒకరు వస్తూనే వుంటారని ఆమెకు నచ్చ చెప్పాడు

ఇంతలో ఎవరో ముసలాయన వచ్చాడు

ఒక చేపని తీసి చేత్తో పట్టుకుని, శంకులు విచ్చి చూసి, ఇవి చచ్చి చాలా సేపైనట్టున్నాయి మొప్పలు తెల్లగా అయిపోయాయి రుచి వుండవు అనుకుంటూ వెళ్ళిపోయాడు

# చేపలు

సీత నెత్తిమీద చేతులు పెట్టుకుని కూర్చుంది వుసూరుమంటూ

నువ్వేం దిగులు పడమాకో ఇప్పుడే వత్తాను సూత్తుండు అంటూ వేగంగా వెళ్ళాడు బైటకి జానయ్య

ఈడి జిమ్మడ అటునుంచి అటే చెక్కేయడు గందా! అనుకుంది సీత

పది నిముషాల్లో తిరిగొచ్చాడు జానయ్య అతని చేతిలో ఏవో రెండు పొట్లా లుండటం గమనించి ఏటి మావా అయ్యి? అని అడిగింది

ఆమెకు సమాదానం చెప్పకుండా, చిన్న బకెట్‌లో నీళ్ళు తెచ్చి దాన్లో ఒక పొట్లాం విప్పి సబ్బుపొడి నీళ్ళలో పోసి కలియ బెట్టాడు నురగ తయా-రయ్యింది ఒక్కో చేపని తీసి బక్కెట్లో ముంచి అయిదు నిముషాలాగి బైటికి తీసి గచ్చుమీద పరిచాడు

ఆశ్చర్యంతో కళ్ళు ఇంతయ్యాయి సీతకి

రెండో పొట్లాం కూడా విప్పి పక్కన పెట్టాడు అది ఎర్రటి ముద్దలా వుంది

ఏటిమావా అది? సంభ్రమంగా అందిసీత

మేకపోతు నెత్తురే! కొద్దిగా గడ్డ కట్టిందిలే-గానీ, ఇదిగో ఇలా దీన్ని వేలికి అద్దుకుని, సేప లన్నిటికీ మొప్పలు విడదీసి లోపల రాయి అప్పుడు సూడు, ఈటి తడాఖా! అన్నాడు

రెండు నిముషాల్లో ఆ పని పూర్తయింది ఇప్పుడు చేపలన్నీ మొప్పలు ఎర్రగా రక్తం ప్రవహిస్తున్నట్టు తాజాగా వున్నాయి

మావ చానా తెలివిగల్లోడే అంది మెచ్చు-కోలుగా చూస్తూ

గట్టిగా నవ్వేశాడతను ఓసి, యెర్రిమొగవా! మనబోటోళ్ళకి బతుకు తెరువే కష్టంగా వుంటే మోసం దగా అంటూ కూచుంటే బువ్వెట్టా వస్తాదే! చిన్న సేపల్ని పెద్ద సేపలు తినటంలా! ఒకర్ని ఒకరు మోసం చేసుకోటం లోక సహజం తే, తే! ఎదవాలో చన్లా, నువ్వూ అన్నాడు

సీత అతని కళ్ళల్లోకి చూస్తూ, మావా! మనకి లగ్గ మెట్టేయమని మా అయ్యతో సెప్పేసానియ్యాల అంది

సెప్పు, సెప్పు ఆలిస్యంఅయితే ఒడ్డున పడ్డ సేప మాదిరి కొట్టుకు సచ్చిపోద్ది నా పాణం అన్నాడు జాలిగా

సీత నవ్వేసింది చిత్రంగా

ఇంతలో ఇద్దరు ముగ్గురు తాజావి చేపల కోసం వచ్చారు

తాజా సేపలు, ఏటి సేపలు బాబూ! అయిసులో పెట్టినియ్యి కాదు రండి, రండి అంది

వాళ్ళు వచ్చినంత హడావుడిగా బరువు అదీ చూసుకుని పది కిలోలకి డబ్బులిచ్చి వెళ్ళిపోయారు

సీత ఆనందం అంతా ఇంతా కాదు

తండ్రితో శాపనార్థాల పోరు తప్పినందుకు సంబరంగా వుందామెకి

మరో అరగంటకి తట్టలో చేపలన్ని అమ్ముడై పోయాయి

మొనగాడిలా మీసం మెలేస్తూ చూశాడు జానయ్య ఆమెని ఏటీ ఇప్పుడు సెప్పు నే నేంటో, నా కతేంటో అర్థమైందా! అన్నాడు

సీత అతనికి దగ్గరగా జరిగి, అర్థమైంది కానీ మావా ఇలా సేయటం మోసం కాదూ! అంది అమాయకంగా □

# మీపాపాయికి సిరిలాక్ ప్రేమను అందివ్వండి!

ఇప్పుడు కొత్త ప్యాక్‌లో

**సుమారు 4వ నెల నుంచి, మీ పాపాయికి పాలతోపాటు, ఘనపదార్థాలు కూడా అవసరమవుతాయి. బాబుకు సిరిలాక్ ప్రేమను అందించడానికి తగిన సమయం ఇదే.**

**పోషకాహారపు లాభం :** ప్రతి సిరిలాక్ మోతాదు, మీ పాపాయికి కావలసిన పోషకాహారాలు—మాంసకృత్తులు-కార్బోహైడ్రేట్లు-కొవ్వు-విటమిన్లు-ఖనిజాలను సమకూరుస్తుంది. మీ పాపాయి ప్రత్యేక అవసరాలకు తగినట్లు సమపాళ్లలో తయారయింది.

**త్వరితగతి లాభం :** మీ పాపాయికి ఎప్పుడు కావాలంటే, అప్పుడు, సెకన్లలో సిద్ధమవుతుంది. దీనిలో పాలు, పంచదార ఉండనే ఉన్నాయి. ఇక, మీరు, ముందు మరిగించి వుంచుకున్న నీటితో దీన్ని కలపాలి-అంతే!

**రుచి లాభం :** మొదటి ఘన ఆహారం, కొత్త గమ్మత్తు-రుచిని అనుభూతినీ ఇస్తుంది. పాపాయిలకు దీని రుచి ఎంతో నచ్చుతుంది. ఇది, శుభారంభం కూడా. మీ పాపాయికి సమపాళ్లలో పోషకాహారాన్ని అందచేసేందుకూ, తయారీలో శుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను అనుసరించండి.

**పెరుగుదల పట్టిక ఉచితం !**

మీ పాపాయికి తన స్వంత పెరుగుదల పుస్తకం కోసం రాయండి-సిరిలాక్, పోస్టుబాక్సు-3 కొత్త ఢిల్లీ 110008






"రూపాయి మల్లెపూలివ్వు అన్నాడు నారాయణమూర్తి లాల్చీ జేబులో నించి డబ్బులు బయటకు తీస్తూ

సరిగ్గా అప్పుడే రివ్వున సైకిలు మీద వచ్చి రక్కున ఆగిపోయి సైకిలు దిగి అక్కడకు వచ్చాడు ఒక యువకుడు అతనికి పాతికేళ్ళుంటాయేమో ప్యాంటు జేబులోంచి పర్సు బయటకు తీస్తూ రెండు రూపాయల పూలివ్వు అన్నాడు దుకాణంలో కూర్చున్న ఆడదానితో

మూడు రోజుల్నించి పూలెట్టుకెల్లడం లేదేంటయ్యగారూ అన్నది ఆమె పువ్వులను ఆకులో పొట్లంగా చుడుతూ - అదోలా నవ్వి

ఆ యువకుడు కూడా ముసి ముసిగా నవ్వి ఏం చెప్పమంటావ్? బయట కూర్చుంది అన్నాడు డబ్బులు ఇస్తూ

పువ్వుల పొట్లం తీసుకుని ఆ యువకుడు గబుక్కున సైకిలు ఎక్కి మళ్ళీ రివ్వున వెళ్ళిపోయాడు

కొత్తగా పెళ్ళయిన కుర్రాడిలా వున్నాడనుకున్నాడు వెళుతున్న ఆ యువకుడిని చూస్తూ ఆయనకు ఒక్కసారిగా తనకు పెళ్ళయిన తొలి రోజులు గుర్తుకు వచ్చాయి నారాయణమూర్తికి

పెళ్ళయిన కొత్తల్లో తను కూడా ఇంతే మల్లెపువ్వుల కాలం వచ్చిందంటే సావిత్రి కోసం రోజూ సాయంత్రం బజారునించి పువ్వులు తీసుకెళ్ళేవాడు బయట కూర్చున్న ఆ మూడు రోజులూ మాత్రం పువ్వులు కొనే ధ్యాస వుండేదికాదు

నవ్వుకున్నాడాయన ఈ మధ్య అంటే దాదాపుగా ఒక నెల రోజుల క్రితంనించి, తను ఆ పువ్వులమ్మే ఆడదాని దగ్గరే రూపాయి మల్లెపూలు రోజూ కొనుక్కొని పోతున్నాడు ఆ దుకాణం ఆడది తను తీసుకెళ్ళే పువ్వులు దేవుడి ఫోటోలకు వెయ్యటానికని అనుకుంటోందేమో కాని రూపాయి పువ్వులు తన అర్ధాంగి సావిత్రి తల్లోకి, జడలోకి అని దానికేం తెలుసు? అనుకున్నాడు

రైలు గేటు దగ్గర • నారాయణమూర్తికి చలమయ్య కనిపించాడు ఆయన తాలూకాఫీసులో హెడ్ క్లర్క్‌గా నౌకరీ చేసి ఆరేళ్ళ క్రితం పదవీ విరమణ చేశాడు ఆయన నారాయణమూర్తి కంటే ఆరు నెల్లు చిన్నవాడు ఆయనకి తలమీద జుట్టు చాలవరకు రాలిపోయింది

అవునూ మీ కొడుకూ కోడలూ ఈ వూర్నించి వెళ్ళిపోయారు కదా ఇంకా ఎవరి కోసం నువ్వు రోజూ పువ్వులు తీసుకెడుతున్నావ్? అనడిగాడు చలమయ్య

నారాయణమూర్తి నవ్వి కోడలు లేకపోతేనేం? సావిత్రి లేదూ? అన్నాడు

అయినా ఇన్ని పువ్వులా? అన్నాడు ఆశ్చర్యంగా

మళ్ళీ నవ్వాడు నారాయణమూర్తి జవాబుగా

ఏమిటీ అరవై అయిదేళ్ళ వయసులో నువ్వు కుర్రాడిగా తయారవుతున్నావా కొంపదీసి అంటూ నవ్వాడు చలమయ్య స్నేహితుడి భుజం మీద చేత్తో తడిమి

వయసులో లేదు - మనసులోనే వుంది అని ఒక కవి అన్నాడు సర్లే వస్తాను మళ్ళీ కలుద్దాం అని అక్కడినించి కదిలాడు ఆయన

అప్పుడే ఏడు గంటలు దాటుతోంది కొంచెం దూరంలో వున్న పార్కులో రేడియోలో వార్తలువస్తున్నాయి

వీది దీపాలు మసగ్గా వెలుగుతున్నాయి అప్పటికే చంద్రుడు ఆకాశం మీదికి వచ్చాడు వెన్నెల వెలుగు అంతటా పరచుకుంది

అరవై ఐదేళ్ళ నారాయణమూర్తికి హుషారుగా వుంది ఇంటి దగ్గర తన భార్య సావిత్రి ఒంటరిగావుంటుంది అనే ఆలోచన ఎంతో ఉత్సాహాన్ని ఇస్తోంది

ఆయన గబగబా నడిచి ఇల్లు చేరాడు వెళ్ళేసరికి ఆయన భార్య సావిత్రమ్మ వరండాలో కూర్చుని వుంది పడక్కుర్చీలో రోడ్డు మీదకు చూస్తూ

ఆయన్ని చూస్తూనే నిలబడింది పువ్వుల పొట్లాన్ని భార్యకు ఇచ్చాడు

సావిత్రమ్మ నవ్వుతూ గుర్తుందా మీరు బజారుకు వెళ్ళేటప్పుడు గుర్తుచెయ్యటం మరచిపోయాను అన్నది

మన పెళ్ళయిన కొత్తల్లో కూడా నువ్వు రోజూ చెప్పేదానివా సావిత్రీ రోజూ నేనే తీసుకు వచ్చేవాడిని ఆ అలవాటు మరచిపోయి ఎన్నేళ్ళయ్యిందో అన్నాడాయన

ఇద్దరూ పక్క పక్కనే భోజనానికి కూర్చున్నారు

ఒకరికొకరు వడ్డించుకుంటూ భోజనాలు ముగించారు మధ్య గదిలో సిద్ధంచేసి వున్న డబుల్ కాట్ బెడ్ మీద వెళ్ళి కూర్చున్నాడు నారాయణమూర్తి ఆ మంచం పెద్ద కొడుకుది సామానంతా నెల రోజుల క్రితం తనకు బదిలీ అయిన వూరుకు తీసుకువెళ్ళాడు కాని ఆ డబుల్ కాట్‌ని అక్కడే వుంచాడు తర్వాత ఎప్పుడో వచ్చి తీసుకెళతానన్నాడు

పక్కమీద బీరువాలో వున్న కొత్త గళ్ళ దుప్పటి పరిచింది సావిత్రమ్మ

వంటిల్లు సర్ది పళ్ళెంలో ఆకులు, వక్కలు, సున్నం తీసుకువచ్చింది సావిత్రమ్మ భర్త పక్కనే కూర్చుని కబుర్లు చెబుతూ తమలపాకులు చుట్టి ఇచ్చింది

గదిలో లైటు వెలుగుతోంది

ఆకులు వేసుకున్న తరువాత ఆమె మంచం పక్కగా వున్న టేబిలు మీది ఫోటో ఆల్బమ్‌ను తీసింది అది నలభైయేళ్ళ క్రితం ఆల్బమ్ అందులో నారాయణమూర్తి, సావిత్రమ్మల ఫోటోలు వున్నాయి నెలరోజులుగా ఆ ఆల్బమ్ అక్కడే వుంటోంది రోజూ పడుకోబోయే ముందు ఒక్కసారయినా ఆ దంపతులిద్దరూ తమ పెళ్ళినాటి ఫోటోలను, ఒకప్పటి వాళ్ళ వయసు అందచందాలను చూసుకుని మురిసిపోతున్నారు

భార్య పక్కనే నిలబడి వున్న ఫోటోని చూస్తూ మళ్ళీ ఆ రోజులు, ఆ ఆనందం, ఆ హుషారు ఈ జన్మకు తిరిగిరావు కదా సావిత్రి ఈ ఫోటోల్ని చూస్తుంటే కాలం పెరిగే వయసూ మనుషుల రూపాలను ఎంతగా మార్చేస్తాయో తెలుస్తోంది అన్నాడాయన అదోలా

నాకు మాత్రం ఇప్పటికి మీలో అప్పటి రూపమే కనపడుతోంది పెళ్ళిచూపులకు వచ్చినప్పుడు మీరెట్లోవున్నారో, ఏ ప్యాంటు షర్టు వేసుకున్నారో నాకు ఇప్పటికి కూడా గుర్తుంది అన్నది సావిత్రమ్మ

నిజంగానా? అన్నాడు నారాయణమూర్తి ఆశ్చర్యంగా

అవును నాకు అన్నీ బాగానే గుర్తున్నాయి అన్నదామె

భార్యను ప్రేమగా, ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడాయన

తల్చుకుంటే ఇప్పుడు ఎంతో దిగులుగా వుంది సావిత్రీ మనం జీవితంలో చాలా పోగొట్టుకున్నాం

ఆ వెలితి ఏమిటో ఇప్పుడు నీతో ఇలా దగ్గరగా మసలుతూ వుంటే అర్ధమవుతోంది అన్నాడు ఆమె కళ్ళలోకి చూస్తూ

బాధపడకండి మీరు తక్కువ వయసులోనే బాధ్యతల సుడి గుండంలో చిక్కుకుపోయారు కనీసం ఇప్పుడయినా ఈ జారిపోయే వయసులో నైనా మీరు తృప్తిగా వుండగలిగితే అంతే చాలు ఇంకా నయం ఇప్పటికైనా, ఇన్నాళ్ళకైనా మనిద్దరం కలిసి వుంటూ ఒకరి మనసులో మాటను ఒకరు చెప్పుకునే అవకాశం కలిగింది అన్నది సావిత్రమ్మ

అవును నన్ను పెళ్ళి చేసుకుని నువ్వు కూడా బాగా నష్టపోయావు సావిత్రీ ఈ విషయమే నాకు బాధను కలిగిస్తోంది విచారంగా అన్నాడాయన

గతించిన రోజుల్ని తల్చుకుని, బాధపడకండి కనీసం ఈ వయసులో అయినా మనం తృప్తిగా వుందాం' అన్నది సావిత్రమ్మ

కొంచెం సేపటి తర్వాత ఇద్దరూ నిద్రలోకి జారుకున్నారు

సావిత్రమ్మకి వయసు తక్కువకాదు అరవై ఒక్క ఏడు భర్తకంటే నాలుగేళ్ళు చిన్నది వాళ్ళిద్దరి పెళ్ళికి వచ్చిన వాళ్ళంతా ఆ ఇద్దరినీ చూసి జంట బావుందని అనుకున్నారు కొంతమందికి వయసు వచ్చినకొద్దీ లావుగా మారిపోతారు కాని సావిత్రమ్మ లావు కాలేదు సన్నగానే వుంది నారాయణమూర్తిలో కూడా వయసు, వృద్ధాప్యం తెచ్చిన మార్పులు తప్పించి మామూలుగానే వున్నాడు

నెల రోజుల నించీ వాళ్ళిద్దరి మధ్య సాన్నిహిత్యం పెరిగిపోయింది నెల రోజుల క్రితం వరకూ వాళ్ళ పెద్దకొడుకు, కోడలు, ముగ్గురు పిల్లలూ అక్కడే వున్నారు అతని పేరు ప్రకాశం బ్యాంకులో ఉద్యోగం నెల క్రితమే తెనాలికి బదిలీ అయ్యింది అంతా ఆ ఇంట్లోంచి వెళ్ళిపోయారు ఆరు నెల్ల క్రితమే రెండో కొడుకు సుందరానిక్కూడా హైదరాబాద్‌లో ఒకప్రయివేటు కంపెనీలో ఉద్యోగం వచ్చి వెళ్ళిపోయాడు అప్పుడు ఆ ఇంట్లో ఇద్దరే మిగిలిపోయారు

నారాయణమూర్తికి పెళ్ళయిన రెండేళ్ళకే తల్లీ, తండ్రీ ఒక బస్సు ప్రమాదంలో చనిపోయారు అప్పుడే కుటుంబ భారమంతా ఆయన మీద పడిపోయింది అప్పటికే తాలూకా ఆఫీసులో ఉద్యోగం రావటం వల్ల కుటుంబం బజారున పడకుండా సరిపోయింది ఇద్దరు తమ్ముళ్ళు, ఒక చెల్లెలు బాధ్యతను పూర్తిగ తనే వహించాడు తమ్ముళ్ళకు చదువులు చెప్పించాడు చెల్లెలుపెళ్ళి చేశాడు వాళ్ళ బాధ్యత తీరిందనుకునేసరికి నారాయణమూర్తికి తను కన్న సంతానం ఇద్దరు మగపిల్లలూ, ఇద్దరు ఆడ పిల్లలూ ఎదుగుతూ వచ్చారు వీళ్ళందరినీ పెంచి పెద్ద చేయటంలో నారాయణమూర్తి, సావిత్రమ్మ బాగా అలసిపోయారు

ఇంటి నిండా ఎప్పుడూ మనుషులు నారాయణమూర్తి సంపాదించటంతోనూ, కుటుంబ అవసరాలు తీర్చటంలోనూ సతమతమయిపోతే సావిత్రమ్మ ఇంట్లో మనుష్యులకు వండి పెట్టటంలోనూ, వాళ్ళ అవసరాలు తీర్చటంతోనూ అలిసిపోయింది

ఇన్నేళ్ళ వరకూ ఆ దంపతులిద్దరికీ ఒకే ఇంట్లో వుంటున్నా అన్యోన్యంగా మాట్లాడుకోటానికిగానీ, మనసు విప్పి మాట్లాడుకోటానికిగాని అవకాశమే కలగలేదు ఏకాంతాన్ని ఎప్పుడో మరిచిపోయారు యాంత్రికంగానే సంసారం చేసారు ఎన్నో యేళ్ళతో ఏకాంతంగా కలుసుకునే అవకాశాలు చాల తక్కువగానే లభించాయి

యవ్వనం ఇద్దరికీ బాధ్యతల మధ్య పడి నలిగిపోయింది కరిగిపోయింది హారతి కర్పూరంలా

ఎంతో ఆనందాన్ని అనుభవించవలసిన కాలం సాదాగా చాలా మామూగా గడిచిపోయింది దీని తాలూకు అసంతృప్తి ఇద్దరిలోనూ పూర్తిగా నిండిపోయింది

పెద్దకొడుకు పెళ్ళయ్యింది ఇద్దరు కూతుళ్ళకీ పెళ్ళిళ్ళు అయ్యాయి మళ్ళీ వాళ్ళందరికీ నోములు వ్రతాలు పురుళ్ళూ అంటూ ఎప్పుడూ ఇంటికి వస్తూనే వున్నారు వాళ్ళు రావటం తగ్గించేసరికి పెద్దకొడుక్కి ఆ వూరికే బదిలీ అయ్యింది కుటుంబంతో వచ్చేశాడు అప్పటికి రెండోవాడు చదువు పూర్తిచేసుకుని ఉద్యోగం లేక ఇంట్లోనే ఉన్నాడు

ఆరు నెల్ల క్రితమే సుందరానికి ఉద్యోగం వచ్చి హైదరాబాద్ వెళ్ళిపోయాడు ప్రకాశం తెనాలి వెళ్ళిపోయాడు

పెద్దకొడుకు బదిలీ మీద కుటుంబంతో ఇంకో వూరు వెళ్ళిపోతున్నప్పుడు బాధ కలిగినా ఈ వయసులో ఐనా తిరిగి ఏకాంతం దొరుకుతోందనీ, ఇద్దరి మధ్య సాన్నిహిత్యం పెరుగుతుందనీ అనుకున్నారు వాళ్ళు

వాళ్ళంతా వెళ్ళిపోయిన రోజు ఇద్దరికీ ఏమీ తోచలేదు ఇల్లంతా బోసిపోతున్నట్లుగా ఏదో వెలితిగా అనిపించింది రెండు మూడు రోజులకు ఆ ఇంట్లో వాళ్ళిద్దరూ వుండటానికి అలవాటుపడ్డారు

ఈ నెల రోజుల్లోనూ ఆ వృద్ధ దంపతుల మధ్య అన్యోన్యత బాగా పెరిగిపోయింది సావిత్రమ్మ భర్తకు ఇష్టమైన వంటలన్నీ చేసి పెడుతోంది

నారాయణమూర్తి రోజూ భార్యతో కలసి సాయంత్రం వేళ బయటకు వెళుతున్నాడు ఈ నెల రోజుల్లోనూ భార్యతో కలసి ఆయన నాలుగు సినిమాలు చూశాడు

కళామందిరంలో సాంస్కృతిక కార్యక్రమాలకు సంగీత కచేరిలకు తీసుకువెళ్లాడు మేజిక్ షోకు తీసుకువెళ్లాడు చాలాసార్లు పార్కుకు కూడా తీసుకువెళ్లాడు



పార్కులోకి వచ్చే మనుషులు నారాయణమూర్తినీ, సావిత్రమ్మనీ వింతగా చూశారు సాధారణంగా పార్కులకు వయసులో వున్న జంటలు తప్పించి వృద్ధ దంపతులు ఎక్కువగా రారు

ఒక్కోసారి సినిమాకు వెళ్లి తిరిగివస్తూ హోటల్లోనే ఇద్దరూ భోజనం చేసి కిళ్లీ వేసుకుని ఇంటికి వచ్చేవాళ్లు

మళ్లీ మీరు రంగుల చొక్కాలు వేసుకుంటే చూడాలని వుంది ఆ రోజుల్లో మీరు పువ్వుల చొక్కాలు గళ్ల చొక్కాలు వేసుకుని ఎంతో దర్జాగా వుండేవాళ్లు అన్నది సావిత్రమ్మ ఒక రోజు

ఆ రోజు సాయంత్రం భార్య కోరిక మీద బట్టల షాపుకువెళ్లాడు నారాయణమూర్తి సావిత్రమ్మతో

రెండు రంగుల షర్టులను సెలక్టు చేసింది ఆమె తర్వాత ఆమెకి ఒక పువ్వులున్న పట్టు చీరను కొనిపెట్టాడు ఆయన

ఈ షర్టులు వేసుకుంటే ఎవరైనా నవ్వుతారేమో అన్నాడాయన తిరిగివస్తూ

ఎవరు నవ్వేది? నాకు చూడాలని వుంది నాకోరిక తీర్చండి ఎవరి ఇష్టం వారిది మీరు పూలున్న పట్టు చీర కొన్నారు ఎవరో నవ్వుతారని నేను వద్దన్నానా? అన్నది ఆమె

నెల రోజులుగా ఆ వృద్ధ దంపతుల ప్రవర్తనలో వచ్చిన మార్పును ఆ వీధిలో వున్న వాళ్లంతా గుర్తించారు ఆశ్చర్యపోయారు ఈ వయసులో వీళ్లు కొత్త భార్యాభర్తల్లా వుంటున్నారేమిటి? అనుకున్నారు ఇద్దరూ దాదాపుగా రోజూ జంటగా అలంకరించుకుని షికార్లకు బయల్దేరటం చాలామందికి వింతగా తోచింది

ఇంతకుముందు తలదువ్వుకోకుండా జుట్టు రేగి ముడిపెట్టుకుని వుండే సావిత్రమ్మ ఇప్పుడు తల దువ్వుకుని జడలేసుకుని ముడిపెట్టుకుంటోంది ఎప్పుడూ ఎంతో శుభ్రంగా కడిగిన ముత్యంలా వుంటోంది

ఎన్నో యేళ్లుగా ఎదురు చూసిన ఏకాంతం ఇద్దరికి ఇప్పటికి దొరికింది తమ జీవితాలు

# పడమట సంధ్యారాగం

పడమటికి వాలిపోతున్నాయని ఈ వయసులో ఐనా మిగిలిన ఈ కొద్ది జీవితకాలంలో ఐనా భార్యాభర్తలుగా స్నేహితుల్లా సన్నిహితంగా కలిసి వుండాలని వాళ్లు తాపత్రయపడుతున్నారు

చూసేవాళ్లకు అసహజంగా వున్నా వాళ్ల జీవితాల్లో వున్న తపన చాల సహజమైనదే ఇంకొకరు తమ గురించి ఏమనుకుంటున్నారో అనే ధ్యాస వాళ్లలో లేదు

ఆ రోజు పోస్టులో పెద్దకొడుకు ప్రకాశం దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది

అందులో ప్రకాశం ఇలా రాశాడు

నాన్నకు నమస్కరించి వ్రాయునది-

ముఖ్యంగా - నాన్నా, మన వూళ్లో వున్న బ్యాంకులో పని చేసే సూర్యారావుకు ఈ వూరుకు ట్రాన్సఫర్ కోసం ప్రయత్నం చేస్తున్నాడు ఈ టైములో నేను గట్టిగా ప్రయత్నం చేస్తే మన వూరుకు బదిలీ అవుతుంది నేను మన వూరుకు బదిలీ గురించి ప్రయత్నం చేద్దామనుకుంటున్నాను నువ్వు అమ్మ అక్కడే వుండదల్చుకుంటే నేను బదిలీ కోసం గట్టి ప్రయత్నం చేస్తాను లేకపోతే ఇక్కడే వుంటాను మీరు కూడా ఈ వయసులో ఒంటరిగా అక్కడ ఎందుకు? ఇక్కడకే వచ్చి వుండండి ఏ విషయం నువ్వు వెంటనే నాకు తెలియజెయ్యి నీ జవాబు కోసం ఎదురు చూస్తుంటాను

ఆ ఉత్తరాన్ని చదవగానే నారాయణమూర్తి కంగారుపడ్డాడు కొడుకు ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వచ్చాడంటే తనకి భార్యకి మధ్య దూరం మళ్లీ పెరుగిపోతుంది వాళ్లని బదిలీ చేయించుకుని ఇక్కడకు రావద్దని రాయడం బావుండదు అలా రాయకపోతే తమనే వచ్చి అక్కడే వుండమని బలవంతపెడతాడు సావిత్రితో అక్కడికి వెళ్లటం కూడా తనకు ఇష్టంలేదు

ఇప్పుడేం చెయ్యాలి? ఆలోచనలో పడిపోయాడు నారాయణమూర్తి

సావిత్రమ్మకి కూడా ఈ విషయం గురించే దిగులు పట్టుకుంది

ఆయన వెంటనే కొడుక్కి ఉత్తరం రాయలేదు

వారం రోజుల తర్వాత ఈ విషయం గురించి వెంటనే తండ్రితో మాట్లాడి రమ్మని భార్య శ్యామలను పంపించాడు ప్రకాశం

శ్యామలను నవ్వుతూ ఆహ్వానించింది సావిత్రమ్మ తనెందుకు వచ్చిన కారణం యేమిటో వాళ్లతో చెప్పింది శ్యామల వాళ్లిద్దరూ మాట్లాడలేదు

తర్వాత కొంచెం సేపటికే అత్తగారిలో మామగారిలో వచ్చిన మార్పును గమనించి నిర్ఘాంతపోయింది శ్యామల

పక్కింటివాళ్లు కూడా ఆ వృద్ధ దంపతుల వింత ప్రవర్తన గురించి వాళ్ల అన్యోన్యత గురించి వివరంగా శ్యామలతో చెప్పారు

తన భర్త బదిలీ గురించి రాసిన ఉత్తరానికి మామగారు జవాబు ఎందుకు రాయలేదో అప్పుడు శ్యామలకు బాగా అర్థమయ్యింది

ఒక రోజు ఉండి తెల్లవారి ఉదయం ఇక నేను వెళతాను అన్నది శ్యామల

ఆ విషయంలో ఇంకా మేము ఏది నిర్ణయించుకోలేదమ్మాయ్ వాడితో ఈ మాటే చెప్పు తర్వాత నాలుగైదు రోజుల్లో ఉత్తరం రాస్తాను అన్నాడు నారాయణమూర్తి కోడలితో

శ్యామల వెళ్లిపోయింది

వాడు బదిలీ ప్రయత్నం చేస్తాడేమో అన్నది సావిత్రమ్మ భర్తతో

ఏమో తెలీదు ఇంతకీ వాళ్లు మళ్లీ ఇక్కడికి రావడం నీకు అంగీకారమేనా సావిత్రీ? అడిగాడు నారాయణమూర్తి

కొడుకు కోడలు మనపట్ల మీదనాకు అంతులేని ప్రేమ, మమకారం ఉన్నాయి కాని ప్రస్తుతం వాళ్లకు నా ప్రేమతో పనిలేదు ఈ వయసులో నాకు సన్నిహితంగా వుండాల్సిన మనిషిగా మిమ్మల్నే కోరుకుంటాను ఈ విషయం మీకు మాత్రం తెలీదా? అన్నది ఆమె

నిజమే మన పిల్లలు మన మనసును తెలుసుకోవాలి కదా వాళ్ల దృష్టి, ఆలోచనలు వేరుగా వుంటాయి ఇంత వయసులో కూడా అమ్మ నాన్న పని చేసుకుంటూ కష్టపడటం ఎందుకు? మన దగ్గరే వుంటే సరిపోతుంది కదా అనుకుంటారు ఇది సహజం సావిత్రీ అన్నాడాయన

చూద్దాం అంతగా వాళ్లు ఇక్కడికి వచ్చినా, మనల్ని అక్కడకు రమ్మని బలవంతపెట్టినా చెయ్యగలిగింది ఏదిలేదు అన్నది ఆమె

కోడలు శ్యామల వెళ్లిన మూడో రోజున ఉత్తరం వచ్చింది కొడుకు ప్రకాశం ఇలా రాశాడు

నాన్నకు నమస్కరించి వ్రాయునది

ముఖ్యంగా - నాన్నా ప్రస్తుతం నాకు ఇక్కడ బాగానే వుంది నేను అక్కడకు బదిలీ కోసం ప్రయత్నం చెయ్యటంలేదు మీరిద్దరూ ఎప్పుడు రావాలనుంటే అప్పుడు ఇక్కడకు వచ్చెయ్యండి-

ఆ ఉత్తరం చదవగానే ఇద్దరూ తేలిగ్గా నిట్టూర్చారు ఆ వృద్ధ దంపతుల హృదయాల్లో తిరిగి సంతోషం ఆనందం చోటు చేసుకున్నాయి □



# ఐటెక్స్

శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు
ఐటెక్స్ కాటుక మీ కళ్లను దినమూ
వేసవియందు చల్లగా కాపాడుతుంది.




ఐటెక్స్ 48 సంవత్సరములుగ మీ నమ్మకానికి
పాత్రమైన ఉన్నతమైన వస్తువు.

అరవింద్ లాబొరేటరీస్, మద్రాసు 600 033.

సీరియల్

ఎస్. భారతీ దేవి



# ప్రేమసాగరం

(గత సంచిక తరువాయి)

జయరాంలో కూడా అనుమానం చోటుచేసుకుందన్న విషయం తెల్సుకున్న వరలక్ష్మి మరింత విజృంబించింది

ఆరోజు జయరాం ఆఫీసు నుంచి రాగానే తల నెప్పిగా ఉందని ఏవో ఫైల్సు చూస్తూ గెస్టురూములో పడుకున్నాడు

ఎనిమిదింటికి ఇంటికొచ్చింది స్వప్న ఆమె హాలులోకి అడుగు పెట్టటం ఆలస్యం అందుకుంది వరలక్ష్మి ఏం తల్లీ! ఈ ఇంటి పరువు బజారున పడెయ్యాలనుకున్నావా? అంది

తెల్లబోయి చూసింది స్వప్న

నలుగురూ నాలుగు రకాలుగా అనుకుంటున్నారన్న ఆలోచన కూడా లేదేం నీకు? పెళ్ళయి భర్తతో కాపురం చేసుకుంటున్న దానివి పరాయి మగాడితో తిరగటానికి సిగ్గు లేదూ? అల్లుడు గారు నలుగురిలో తలెత్తుకు తిరగాలనుకుంటున్నావా? లేదా?

షటప్ పెద్దగా అరిచింది స్వప్న

ఇదిగో చూడమ్మాయి నీ ఇంగ్లీషు అరుపులు మానెయ్యి నీ రాసక్రీడలు చూడలేక అల్లుడుగారు తల పట్టుకుంటున్నారు ఇలాంటి గ్రంధాలు నడుపుతూ ఈ ఇంట్లో ఉండటం ఎందుకు తల్లీ వెళ్ళిపోరాదూ?

స్వప్నకు ఏడుపు కూడా రావటం లేదు ఆమె చూపులు శూన్యంలోక ఉన్నాయి వరలక్ష్మి మాటలు చెవుల్లో గింగురు మంటున్నాయి

పెళ్ళయిన మగాడికి కూతుర్ని ఎరగా వేసి ఎవరో సంపాదించిన ఆస్థని రాజమాతలా అనుబవిస్తూ అబిమానం ఆత్మగౌరవం అన్నీ చంపుకుని కేవలం శరీర సుఖాలందిస్తూ అందుకు ప్రతిపలంగా తన భర్త నుంచి అందినంత సొమ్ము దోచుకుంటున్న ఈమెకూతురు వీళ్ళా తనకు పరువు ప్రతిష్టలను గురించి నీతి పాఠాలు చెబుతుంది?

జయరాం వళ్ళమధ్య జరుగుతున్న సంబాషణంతా వింటూనే ఉన్నాడు అయినా గదిలో నుంచి బయటకు రాలేదు

ఇందులో నా భర్త ఇచ్చిన చనువు కూడా ఉందేమో లేకపోతే, నన్నిలా నిలదీసే అధికారం ఈమె కెక్కడిది ఆ ఆలోచన రాగానే, స్వప్న నవనాడులూ కుంగిపోయాయి నిలబడటానిక్కూడా శక్తి చాలనట్టుగా తన రూములోకి పరుగెత్తింది

రాత్రి పది గంటలయింది జయరాం బెడ్‌రూములోకి రాలేదు స్వప్న అలాగే పడుకునుంది వంట మనిషి భోజనం తీసుకొచ్చి టేబులుమీద పెట్టి స్వప్న మంచానికి దగ్గరగా కూర్చుంది

అమ్మా! ఆ రాక్షస మాటలకు బాదపడు తున్నావా ఆమె సంగతి మీకు తెలియదా? అంది అనునయంగా

అయ్యగారు చనువివ్వకపోతే ఆవిడింత నిర్భయంగా మాట్లాడ గలిగేది కాదు

అవునమ్మా! మీరు స్కూలు దగ్గర కెళ్ళటం మొదలు పెట్టిన దగ్గర్నుంచి ఇంటి విషయాలస్సలు పట్టించుకోవటం మానేసారు అయ్యగారింటికి రావటం ఆలస్యం అయ్యగారు వినేటట్టుగా మీకూ రఘునాద్ బాబుకూ సంబంధం ఉన్నట్టుగా అందుకే మీరు అక్కడకు వెళుతున్నట్టు మాట్లాడుతుంది మీరు ఏరోజు ఏరంగు చీర కట్టుకెళుతున్నారో కూడా అయ్యగార్కి తెలియాలన్న దోరణిలో మాట్లాడుతుంది మీకేం తెలుసమ్మా? ఆవిడ మాటలు వింటే కాపురాలే కూలిపోతాయి వినే నాకు పేగులు మెలిపెడుతున్నట్టుగా ఉంటుంది

నెత్తిమీద మంచుగడ్డలు పెట్టినట్టుగా తలంతా దిమ్మెక్కి పోయింది స్వప్నకు ఆ మాటలు వింటుంటే

అయ్యగారి బయం కూడా లేకుండా పోయింది ఆమెకు నోటి కేమాట వస్తే ఆ మాట వదిలేస్తుంది మొదట్లో అయ్యగారు కోపంగా కసురుకునే వారు రాను రాను అది కూడా పోయింది ఆమె ఏం మాట్లాడినా అయ్యగారు వింటూ కూర్చుంటారు అయ్యగారి. మనస్సులో కూడా అనుమానం కలిగించిందమ్మా చూస్తున్నానుగా? అయ్యగారు చాలా మారిపోయారు ఇంకా కొద్ది రోజులు ఈ మాటలు వింటే నీ కాపురం కూలిపోక తప్పదమ్మా

ఇప్పుడు కూలిపో లేదంటావా?

వీళ్ళను ఇంట్లోకి తెచ్చినప్పుడే మీ కాపురం పాడయిపోయింది ఏ కాస్త సంతోషమయినా మిగిలితే అది వీళ్ళ మాటలతో తుడిచి పెట్టుకుపోతుందమ్మ పెద్దదాన్ని ఒక్కమాట చెబుతాను వింటావా అమ్మ?

జరిగిన కథ–10 మోహినిని రహస్యంగా గుళ్ళో పెళ్ళి చేసుకున్నాడు జయరాం మోహినికి కొడుకు పుట్టాడు మోహినిని బాబుని వాళ్లతో పాటు మోహిని తల్లిని స్వప్న ఇంటికి తీసుకువచ్చేస్తాడు జయరాం స్వప్నకు రోజు రోజుకి జీవితం సమస్యలమయం అవుతోంది జయరాం ఎంతగా తనను బాదించినా స్వప్న అతన్ని వదలి ఎక్కడా ఉండలేక పోతోంది స్వప్న రఘునాద్‌లకు అక్రమ సంబంధం అంటగట్టి ప్రచారం చేస్తూంటుంది వరలక్ష్మి జయరాంలో కూడా అనుమానం మొదలవుతుంది

ఏమిటి రాములమ్మా?

'మీరు స్కూలు దగ్గరకు వెళ్ళటం మానేయండమ్మ ఎందుకంటే, మీరు ఇంట్లో లేని సమయంలో, వీళ్ళిద్దరూ కల్సి అయ్యగార్ని వాళ్ళ వైపుకు తిప్పుకోవాలని చూస్తున్నారు అంతే కాదమ్మా రఘునాథ్ బాబూకూ; మీకూ లేని సంబంధాన్ని అంటగట్టి, ఎలాగో లాగా, మిమ్మల్ని ఈ ఇంట్లో నుంచి తరిమేసి, పెత్తనాన్ని ఈ ఆస్తినీ చేజిక్కించుకోవాలని చూస్తున్నారు అయ్యగారిప్పటికే, చాలా వరకు వాళ్ళ మనిషి అయిపోయారు

పోనీ, రాములమ్మా, చావు కోసం ఎదురు చూస్తూ బ్రతుకుతున్న నాకు, ఈ ఆస్తి మీద వ్యామోహం లేదు ఎలాగూ వాళ్ళే అనుభవిస్తున్నారు వాళ్ళనే స్వంతం చేసుకోనివ్వు గాఢంగా నిట్టూరుస్తూ అంది స్వప్న

ఆస్తి కోసం కాదమ్మా నా బాధ

మరెందు కోసం?

'అయ్యగార్కి దూరంగా మీరు బ్రతకలేరు వీళ్ళ కారణంగా అయ్యగారు మీకు దూరమయితే, మీరేం అవుతారో అని నా భయం అంది కళ్ళు తుడుచుకుంటూ రాములమ్మ

గంటలు గడిచిపోతున్నాయి జయరాం బెడ్‌రూములోకి రాలేదు నెమ్మదిగా బెడ్‌రూములో నుంచి, బయటకొచ్చి, మెట్లు దిగి హాలులోకి వచ్చింది గెస్టు రూములో మాత్రం లైటు వెలుగుతుంది ఆ గుమ్మం దగ్గర కెళ్ళింది ఒక్క నిముషం లోపల కెళ్ళటమా? మానటమా? అన్న సందేహంతో నిల్చుంది

తలుపు మీద చెయ్యి వెయ్యగానే, లోపల గడియ పెట్టని తలుపులు మెల్లగా తెరుచుకున్నాయి

జయరాం, మోహినీ, గాలి కూడా వాళ్ళ మధ్య నుంచి వెళ్ళలేనంత గాఢంగా ఒకరినొకరు పెన వేసుకుపోయి ఉన్నారు అలౌకికమయిన ఆనందంలో మునిగి ఉన్న వాళ్ళు తలుపులు తెరుచుకోవటం గమనించలేదు

ఒక్క ఉదుటున లాన్‌లోకి పరుగెత్తుకొచ్చింది స్వప్న ఆ దృశ్యం ఆమె హృదయాన్ని చీల్చి వేస్తుంది మనస్సు చెదిరింది దుఃఖం పొంగింది భర్తతో పొందిన వైవాహిక జీవితం తలుచుకుంటేనే జుగుప్స కలుగుతుంది అతను ఏం చేస్తున్నాడో, మోహిని బెడ్‌రూములో మూసి ఉన్న తలుపుల వెనుక ఎప్పుడు ఏం జరుగుతుందో తనకు తెలియదు కానీ, ఇప్పుడు ప్రత్యక్షంగా తన కళ్ళ ముందు కనిపించిన దృశ్యం మొండి కత్తితో పేగులను బయటకు లాగుతున్నంత బాధ కలిగిస్తుంది నేను బాధపడటం ఎందుకు? అతను ఆమెకూ ,నాకూ ఇద్దరికీ తాళి కట్టాడు ఇద్దరూ తాళి కట్టిన భార్యలే నేనెందుకు అసూయ పడటం? ఎందుకు బాధ పడటం? తనను తాను ప్రశ్నించుకుంది స్వప్న

ఆ అలజడిని, ఆమె గుండె భరించలేకపోతుంది చనిపోయిన వాళ్ళ డాడీ, మమ్మీలను తలుచుకుని, రోదించసాగింది ఆలోచిస్తున్న కొద్దీ, జయరాం పరమ కిరాతకుడిగా కనిపిస్తున్నాడు

* * * * *

ఉదయం స్వప్నకు మెలకువ వచ్చేసరికి ఏడు గంటలయింది జయరాం కాఫీ తాగుతూ, కిటికీ కెదురుగా కూర్చున్నాడు ఉషోదయ కాంతి కిరణాలలో తెల్లని, అతని రూపం, బంగారు రంగులో కనిపిస్తుంది కళ్ళు తెరిచి అతన్నే చూస్తూ పడుకుంది అతని ముఖం చూస్తుంటే రాత్రంతా నిద్రపోనట్టుగా, వ్యథా భరితంగా ఉంది

స్వప్న బెడ్ మీద నుంచి లేచి, ఎటాచ్‌డ్ బాత్ రూములో కెళ్ళి ముఖం కడుక్కొని పేపరు చూస్తూ సోఫాలో కూర్చుంది

స్వప్నా అతను పిల్చాడు స్వప్న మాట్లాడలేదు

మాట్లాడవేం?'

మీ గొంతు నాకు వినిపిస్తూనే ఉంది నాకు చెముడు లేదు చెప్పండి అంది పేపరులో నుంచి తలెత్తకుండానే

'నువ్వు రోజూ , స్కూలు దగ్గర కెళుతుంది ఎందుకు? అతను కుర్చీలో నుంచి ఆవేశంగా లేచాడు కళ్ళు విప్పార్చుకుని, ఆశ్చర్యాన్ని అణుచుకుంటూ, అతని వైపు తిరిగి చూసింది

నీ మౌనంతో , నన్ను విసిగించకుండా, అడిగిన దానికి సమాధానం చెప్పు

అతనలా మాట్లాడుతుంటే, స్వప్నకు ఏం మాట్లాడాలో తోచలేదు నిస్సహాయంగా చూస్తూ కూర్చుంది అతను టేబులు మీదున్న కాఫీ కప్పును ఒక్క తోపు తో సాదు కిందపడి కప్పు ముక్కలు ముక్కలయింది

ఎందుకా ఆవేశం?

నువ్వు చేస్తున్న నీచపు పనికి, ఉరి పోసుకుని చావాలనిపిస్తుంది

అంత నీచపు పనులు నేనేం చెయ్యటం లేదే?

నా నోటితో చెప్పించుకోవాలనుందా?

ఒకరి చేత వేలెత్తి చూపించుకునే పనులు నేను చెయ్యను అంతేకాదు ఒకరికి సంజాయిషీ ఇవ్వాల్సిన అవసరం కూడా నాకు లేదు ఎరిత మృదువుగా మాట్లాడాలనుకున్నా, ఆ మాటలు ఆమె నుంచి కటువుగానే వచ్చాయి

అన్నిటికీ తెగించిన దానివి నువ్వేమయినా చెయ్యగలవు ఏమయినా మాట్లాడగలవు

నేనేం చెప్పినా, మీరు నమ్మరు నేను మాట్లాడకుండా ఉండటమే



## ప్రేమసాగరం

మంచిది

స్వప్నా! ఎందుకిలాంటి నీచానికి దిగజారుతున్నావు? నా మీద ప్రతీకారం తీర్చుకోవటానికేగా? అందుకు ఇదా మార్గం?

షటప్? అంది రోషంగా, బాదగా విస్తుపోయినట్టుగా చూస్తాడు

మీ వ్యాఖ్యానం అద్భుతంగా ఉంది చూడండి మీ మీద ప్రతీకారం తీర్చుకోవాలనుకున్న దాన్నయితే, మీరు మోహినితో అక్రమ సంబంధం పెట్టుకున్నారని తెల్సిన రోజునే తీర్చుకునే దాన్ని మీరు ఆమె ద్వారా కొడుకును కని వాళ్ళనందర్ని నా నెత్తి మీదకు తెచ్చే వరకూ ఊరుకునే దాన్ని కాదు మీ మీద ప్రేమనింకా చంపుకోలేక పోవటం అది నా బలహీనత ప్రేమను చంపుకోలేకా మీకు దూరంగా ఉండలేని నిస్సహాయ స్థితిలో అనాద పిల్లలకు దగ్గరయ్యాను

మీరు మీ బిడ్డతో మీ బార్యతో ఆనందంగా గడిపే సమయంలో, మీ ఆనందంలో పాలుపంచుకునేటంత విశాల హృదయం నాకు లేక అసూయతో మనస్సూ, తనువూ కాలిపోతుంటే తలుపులు మూసుకుని కూర్చుని ఆ బాదను బరించలేక ఆ టయములో అనాద ఎల్లల మధ్య గడుపుతూ నా బాదను మరిచిపోవాలని ప్రయత్నించటమేనా నేను చేసిన తప్పు?

ఒక్క విషయం చెప్పండి నేనేం తప్పు చేస్తున్నానని నన్ను ఇలా నిలదీసి ప్రశ్నిస్తున్నారు?

సమాదానం చెప్పలేకపోయాడు

ఈ ఆస్థి అంతస్థూ నాది అనుబవించే వయస్సు నన్ను గాడంగా ప్రేమించే వ్యక్తి నాకున్నారు మీ మీద ప్రేమను చంపుకోగలిగితే నెనెంతో అదృష్టవంతురాలినయ్యేదాన్ని మీకు విడాకులిచ్చి బయటకు పంపి, నేను రఘునాద్‌ను పెళ్ళి చేసుకున్నా మీరు నాకు చేసిన ద్రోహానికి ఈ సమాజం నన్ను తప్పు పట్టదు నా ఇంట్లో నుంచి మిమ్మల్ని, మీ సంతనూ బయటకు పంపితే, తిండికి కూడా కటకట పడాల్సిన స్థితి మీది ఈ ఆస్థి మొత్తం మా డాడీ నా ఇష్టానుసారం వ్రాసారన్న విషయం మీక్కూడా తెల్సు నా బర్త స్థానంలో ఉంటేనే సమాజంలో మీ గౌరవం హోదా నిలబడుతుంది నా కళ్ళెదురుగా, మరో ఆడదానితో కాపురం చేస్తున్న మీకు, నన్ను విమర్శించే హక్కూ, అదికారం లేవు

మాట్లాడుతున్నది స్వప్నేనా?అన్నంత ఆశ్చర్యంగా, చేష్టలుడిగిపోయి ఆమెను చూస్తున్నాడు జయరాం

నేను చెప్పిన వాటిల్లో, ఓ ఒక్కటి చెయ్యాలన్నా, ఒక్క నిముషం పట్టదు నాకు ప్రేమంటే, మోసం, నటన మాత్రమే కాదు అస్సలు మీలాంటి వాళ్ళు ప్రేమ పేరును ఉచ్చరించటానికి క్కూడా తగరు యుగాలు గడిచినా, తరాలు గడిచినా, అనార్కలి, సలీమ్, రోమియో జూలియట్ వీళ్ళ ప్రేమ కథలు చిరస్థాయిగా నిలిచిపోయాయంటే వాళ్ళ అమరప్రేమకు చావు లేదు అలాంటి వాళ్ళ కోవకు చెందుతుంది నా ప్రేమ అందుకే, మీరేం చేసినా, మీ మీద ప్రేమతో భరించగలుగుతున్నాను కూటికి గతిలేని అదది, నన్ను గురించి తేలికగా, మాట్లాడుతుంటే, వింటూ కూర్చుంటున్న మిమ్మల్ని భర్త అని అనుకోవటానికే, అసహ్యంగా ఉంది నాకు ఇంత కాలం నుంచి కలగని హేహ్యభావం, ఇప్పుడు కలుగుతుంది అంది రోషంగా వెక్కిళ్ల మధ్య

శిలలా కూర్చున్నాడు

నేను స్కూలుకు వెళ్లేది, రఘునాధితో గడపటానికి కాదు మీరు నమ్మినా, నమ్మకపోయినా ఒక్క విషయం చెబుతున్నాను అతనస్సలు స్కూలు వైపుకే రాడు నేను నిజంగా అతన్ని కలుసుకోవాలనుకుంటే, స్కూలు వంకతో అక్కడ కెళ్ళక్కరలేదు డైరెక్టుగా ఇంటికెళ్లగలను ఎవరయినా శరీరాన్ని అదుపులో ఉంచగలరు గానీ మనస్సును అదుపులో ఉంచలేరు గుర్తుంచుకోండి అంటూ విసురుగా పెపరు టీపాయ్ మీద గిరవాటేసి గదిలో నుంచి బయటకు వచ్చింది స్వప్న

(ఇంకా ఉంది)

## రుసరుసలాడే మిరపకాయ మిసమిసలాడే టమోటాను వరించింది

అప్పుడే అడ్డుకోనలవిగాని ఆశలు పరుగులుదీయ ప్రారంభించాయి.

కిసాన్‌వారి క్రొత్త టమోటా చిల్లీ సాస్ రుచులన్నీ సక్రమంగాకూడి ఆవిర్భవించిన నోరూరించే సరిక్రొత్త సాస్. ఆ రుచి, ఆ పక్వము, ఆ ఘాటు, ఓ•••లొట్టలేయించే ఆ రుచుల మేలు కలయిక••• చివరి బొట్టువరకు జుర్రుకోవాలనిపించే మీ ప్రయత్నాన్ని ఎవరైతే ఆపగలరు.

### కారకారంగా, రుచి రుచిగా రెంటి కలయికలా

చిదిమితే పగిలేలాయుండే తేనెలొలుకు టమోటాలు, తలుచుకుంటే చాలు గగనానికి ఎగిరించే ఎర్రగారపు మిరపకాయలతో చేయగలిపాయి పరిపక్వము చెందిన రెండు విభిన్న రుచుల కలయికలో ఉద్భవించిన సరిక్రొత్త నోరూరించే రుచికి, సాస్‌ల తయారీలో అసమాన పేరు ప్రతిష్ఠలు గాంచిన కిసాన్ వారి అనుభవము తోడైంది. మీకు లభించే రుచి ఇక చెప్పాలా! మీ జిహ్వా చాపల్యం తీరదూ!

### మొదటిసారే ఆ రుచికి అంకితం

మొద్దుబారిపోయిన మీ నాలుకకు జీవముట్టిపడేలా చేయండి. మీరు ఇష్టపడే ఏ వంటకాల జతలోనైనా కిసాన్‌వారి టమోటా చిల్లీసాస్‌ను వాడి చూడండి. ఆ పైన ఆ పేరు చెబితే చాలు ఆరుచికి దాసోహం పోగలరు. ఉత్తేజం పరుగులు వేయనివ్వండి. కిసాన్‌వారి చవులూరించే క్రొత్తటమోటా చిల్లీసాస్‌ను పూర్తిగా ఒంపుకోండి. ఎందుకంటే మీరు ఇష్టపడే ప్రతి వంటకముతో బాటుగాని లేక ఇతర ఏ వంటకపు జతకుగాని అలా జీవముట్టిపడే రుచిని మరే ఇతర సాస్ అందించ లేదు. ప్రయత్నించి చూడండి. ఆ రుచికి అంకితమై పోగలరు.






### కిసాన్‌వారి క్రొత్త టమోటా చిల్లీ సాస్ మరేది దీనికి సరిరాదు

కొత్త శీర్షిక

# జయసుధ సమాధానాలు

ప్రారంభం!



**కె. కుమార్‌సింగ్, నెల్లూరు**

సినిమా నటికి కీర్తిని... అపనిందని సమాన దృష్టితో చూసే ఓర్పు, సహనం కావాలంటాను. మరి మీరేమంటారు?

ఖచ్చితంగా మీతో ఏకీభవిస్తాను. ఆ సహనం... ఓర్పు లేకపోతే ఎక్కువ రోజులు సినిమా పరిశ్రమలో నిలబడటం కష్టం అంటాను.

**ఐ. సత్యకుమారి, అత్తిలి.**

శోభనం గదిలో కట్టుకునే తెల్ల చీరకు...., భర్త పోయిన తర్వాత కట్టుకునే తెల్ల చీరకు తేడా ఏమిటి?

మొదటిది శోభనం కోసం! రెండవది శోకం కోసం!!

**కె. సుధాకరరావు, నంద్యాల.**

ప్రస్తుత సినిమాలు సమాజ జీవితానికి ఎంత వరకూ దోహద పడుతున్నాయంటారు?

తెలుగు సినిమాలు మాత్రం నేటి సమాజానికి ఏ విధంగాను ఉపయోగపడడం లేదు. ఎక్కడో ఒకటో రెండో సినిమాలు మాత్రం వస్తున్నాయి. అవి కూడా పెద్దగా నిలబడటం లేదు. దీనికి ముఖ్య కారణం ప్రేక్షకులే! చక్కని చిత్రాలకు ప్రేక్షకాదరణ ఎంత వుందో.. వుంటుందో మీరే చెప్పండి?

**మల్లెపల్లి అరుణా రెడ్డి, మహబూబ్‌నగర్**

అక్కయ్యా మీరే ముఖ్యమంత్రి అయితే స్త్రీలకు ఏం చేస్తారు?

నా క్యాబినెట్ మినిష్టర్స్ అందరూ స్త్రీలే వుంటారు.

**యస్. సత్తిపండు, ఇబ్రహింపట్నం.**

మీకు తెలుగులో వ్రాయడం... చదవడం రాదని ఓ పత్రికలో చదివాను. ఇది నిజమా?

నూటికి నూరుపాళ్ళు నిజం. అయినా మీ అభిమాన నటిని అయ్యాను. ఇది నిజం కాదా?

## ఉత్తమ ప్రశ్న

**కె. మురళీకృష్ణ, తణుకు**

మిమ్మల్ని ఎక్కువగా అభిమానించే ప్రేక్షక అభిమానులకు మీరు ఏమి అందించగలరు?

మర్చిపోలేని అనుభూతి.

**జె. జగదీష్‌సింగ్, మహబూబ్‌నగర్**

మీకు ఎన్నిసార్లు గ్రీటింగులు పంపినా... ఉత్తరాలు వ్రాసినా జవాబులు యివ్వరెందుకని?

అందరికీ ఖచ్చితంగా పంపిస్తూనే వున్నాను.

**యన్. రవి, కుమారదేవం.**

చదువు ఎందుకు? ఒక్క మాటలో మీరిచ్చే సమాధానం ఏమిటి?

జ్ఞానం కోసం

**పి. రాజకుమారి, జి.యల్.పూర్**

స్త్రీ సినీ నటి జీవితమే భారత నారీమణి భవిష్యత్తుకి మూలమయ్యిందంటాను. మీరేమంటారు?

కాదంటాను.

**లోయ వెంకటలక్ష్మి, కపిలేశ్వరపురం**

1985వ సం.రములో సినీరంగం నుండి విరమిస్తున్నాను అని కొన్ని పత్రికలద్వారా తెలియజేసారు. మళ్ళ '86 సం.రము కూడా నటిస్తున్నాను అన్నారు. ఇది కళా రంగం మీద అభిమానమా? లేక...?

కళా... కాసుల రంగం మీద అభిమానం.

**టి. గోపాలం, కాకినాడ**

ముందు అన్నింటికి అంగీకరించి నమ్మి వచ్చాక వెన్నుపోటు పొడిచే భర్తలని ఏ చట్టం శిక్షించకపోయినా దేవుడైనా శిక్షిస్తాడా?

మగరాజులు మీకే తెలియాలి.

**రమాదేవి, హిందూపురం**

మీ దృష్టిలో జీవితం అంటే ఏమిటి?

తిరిగిరాని క్షణికమైన మధురానుభూతి.

**వై. వి. జగదీశ్వరరావు, ఆముదాలవలస**

మీకు హిందీ సినిమాల్లో నటించడం యిష్టం లేదా?

ఇష్టం లేక కాదు. ఒక వూరికి కరణంగా వుండి మరొక వూరి వెట్టి కావడం యిష్టంలేదు. □

కూపన్

## ఆంధ్రసచిత్రవారపత్రిక

## జయసుధ సమాధానాలు

ప్రశ్న ____________________

____________________

____________________

పంపినవారి పేరు:

పూర్తి చిరునామా




## యు. సూర్యనారాయణబాబు చిత్రాలు

కోడి రామకృష్ణ దర్శకత్వంలో జూలైలో సెట్స్‌కు వెళ్ళే చిత్రంలో సుమన్ హీరో. కె. బాపయ్య దర్శకత్వంలో డిసెంబర్ నుంచి తయారయ్యే చిత్రంలో మిథున్ చక్రవర్తి హీరో. అనంతరం కృష్ణ హీరోగా భారీ ఎత్తున రూపొందే చిత్రానికి ఎ. కోదండరామిరెడ్డి డైరెక్టరు.

## విజయనిర్మల దర్శకత్వంలో కృష్ణ "పరశురాముడు"గా అట్లూరి తులసీదాస్ చిత్రం

"మార్చి 15 నుంచి 30, ఏప్రిల్ 20 నుంచి 25, ఊటీలో పాటల చిత్రీకరణతో షూటింగ్ పూర్తవుతుంది." అన్నారు విజయనిర్మల. ఈమె స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో విజయరామా ఎక్స్‌పోర్ట్స్ అధినేత ఎస్. మోహన్ నిర్మించే "పరశురాముడు" చిత్రంలో కృష్ణ, సత్యనారాయణ, జె. వి. సోమయాజులు, గిరిబాబు, వేలు, వీరభద్రరావు, కోట శ్రీనివాసరావు, ముగ్గురు ముఖ్య పాత్రధారులు ఉంటారు. సత్యానంద్ మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, పుష్పాల గోపీకృష్ణ ఛాయ, శ్రీను నృత్యాలతో అట్లూరి తులసీదాస్ సమర్పణ.

# సినిమా విశేషాలు

-జి.వి.జి.

## "పుణ్యస్త్రీ"లో ఆనవాళ్ళు

బాబూరావు (గొల్లపూడి) ఇచ్చిన ఫోటో చూసి పార్వతి (అన్నపూర్ణ) "పెళ్ళికొడుకు వివరాలు కనుక్కొస్తానని అంత అర్జంట్‌గా పరుగెత్తుకెళ్లారు. ఇలాంటి ఫోటో తెచ్చారేం? కాస్త ముక్కూ మొహం తెలిసేది తీసుకురావచ్చుగా? అతను ఎత్తు ఎంత ఉంటాడు?" అని అడిగింది.

"అంటే, టైలర్ కొట్టొంచి టేపు తీసుకెళ్ళి ఎత్తు ఎంతో కొలుచుకు రావాలంటావా?" అన్నాడు బాబూరావు.

"సర్లెండి ... ఇంతకీ, అతను ఎలా ఉంటాడు? ఏ రంగు?"

"రంగు అంటే ... నాలా తెలుపూ కాదు; నీలా ఎరుపూ కాదు. దబ్బపండులా పచ్చగా ఉంటాడు."

పక్కనే ఉన్న వాళ్ళబ్బాయి బాలు (మాస్టర్ ఆలీ) "అతనికి పచ్చ కామెర్లేమో?" అనేసరికి వాడిని కొట్టి "శుభమా అని సంబంధం చూస్తోంటే, పెళ్ళికొడుక్కి పచ్చ కామెర్లుంటాడా? నోరా - అది మున్సిపాలిటీ తొట్టా?" అన్నాడు బాబూరావు.

"పోనీ ... కామెర్లో - కాదో మీరు కనుక్కున్నారా?"



ఈ రోజును సూపర్ ఫ్రెష్ రోజుగా చేసుకోండి


క్రొత్తది!


SUPER
FRESH
సూపర్ ఫ్రెష్ సహజమైన హాయనిపించే సుఖానుభూతిని
చేకూర్చే సుగంధ భరిత క్రొంగొత్త సబ్బు మీచర్మానికి మృదుత్వాన్ని
చేకూర్చి మీకు ఉల్లాసాన్ని కొనితెస్తుంది
అందుకే కొద్దిగా తాజాదనాన్ని జల్లుకోండి
ఈ రోజును సూపర్ ఫ్రెష్ రోజ గా తీర్చుకోండి

# ఎన్. టి. ఆర్.కు నేపథ్యంలో మాట్లాడిన 'కంచు కంఠం'

## దశరథరామిరెడ్డి

పి. ఎ పి సంస్థ వీర ప్రతాప్ అనే చిత్రాన్ని తెలుగులో డబ్ చేస్తోంది 1957లో అందులో పదిమందితో కలిసి వీర ప్రతాప్‌కి - జై అని అరిచినా చాలని తపనపడ్డ బత్తెపాటి దశరథరామిరెడ్డి నేడు ఎంతో బిజీగా ఉన్న డబ్బింగ్ ఆర్టిస్టు తెలుగులో డబ్ చేయబడ్డ చిత్రాల్లో ఎం జి ఆర్ శివాజీ-గణేశన్ జెమినీ గణేశ్ నంబియార్ ఎం ఆర్ రాదా, రజనీకాంత్ రాజ్‌కుమార్ ఉదయకుమార్ లాంటి ప్రముఖ ఆంధ్రేతర హీరోలకు ఈయన గాత్రదానం చేశారు ఇటీవల ప్రతిఘటన చిత్రంలో చరణ్‌-రాజ్‌కు నేపథ్యంలో తన కంచు కంఠాన్ని వినిపించి, తన ఖ్యాతిని మరింత పెంచుకున్నారు

ఈయన తెర వెనుకే కాక బాల్యంలో తెర ముందు కూడా అనుభవం గడించారు తొమ్మిదవ ఏట నుంచే రంగస్థలానుభవం ఉంది రామదాసు లో రఘురాముడు హరిశ్చంద్ర లో లోహితాస్యుడు పాత్రలు ధరించారు ఆ తర్వాత రామదాసు భవానీశంకరుడు కృష్ణుడు నారదుడు వగైరా ప్రధాన భూమికలను కూడా నిర్వహించారు మధుర గాయకుడు కూడా అసలు 1952 లోనే నేపథ్య గాయకుడుగా ప్రయత్నించటానికి మద్రాసులో ఉండి కొన్ని చిత్రాల్లో కోరస్‌లో సోలో బిట్సు పాడారు ఆ సంవత్సరం చివరన తన స్వస్థలమైన నెల్లూరు జిల్లాలోని కోవూరుకు వెళ్ళిపోయి కొన్నేళ్ళు ఎండోమెంట్స్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా పని చేశారు కొందరు మిత్రుల ప్రోత్సాహంతో 1957లో మళ్ళీ మద్రాసుకు వచ్చారు

ఈయన తొలిదొల్త డబ్బింగ్ చెప్పిన చిత్రం ఉత్తమ ఇల్లాలు (కరుప్పుకరశి) హీరో విలన్ మరేదైనా ప్రాధాన్యత గల పాత్ర ఉన్నా ఈయనచేతే



డబ్బింగ్ చెప్పించేవారు. స్ట్రెయిట్ చిత్రాలలో ... "శ్రీకృష్ణ పాండవీయం"లో భీమునికి, "కంచుకోట"లో ఉదయకుమార్‌కి, ఇంకా "శ్రీకృష్ణ సత్య, వీరాంజనేయ, భీమాంజనేయ యుద్ధం, శ్రీరామ పట్టాభిషేకం" చిత్రాలలో ఆంజనేయ పాత్రధారులకు, "వీరాభిమన్యు"లో ఘటోత్కచ పాత్రధారి నెల్లూరు కాంతారావుకి, "జగత్ కిలాడిలు"లో భయంకర్ పాత్రధారి రావుగోపాలరావుకు వాయిస్ ఇచ్చారు.

ఎన్. టి. ఆర్. నటించిన "గజదొంగ" చిత్రం తమిళ వెర్షన్ ముందుగా విడుదలయింది. అది తెలుగులో డబ్ చేయబడ్డప్పుడు హీరో పాత్రకు దశరథరామయ్య డబ్బింగ్ చెప్పారు కాని తమ అభిమాన హీరో కంఠానికి బదులు మరొకరి కంఠం వినిపించడం ప్రేక్షకులకు నిరాశ గొల్పుతుందని ఆ చిత్రం తాలూకు ప్రకటనలలో హీరోకి దశరథరామయ్య కంఠం వినిపించబడుతుందని ప్రత్యేకంగా పేర్కొబడింది 1977లో అన్నదమ్ముల సవాల్ చిత్రంలో రజనీకాంత్‌కు ఈయన వాయిస్ ఇచ్చారు ఆ తర్వాత చాలా చిత్రాలలో కూడా ఆ నటునికి ఈయనే కంఠాన్ని ఎరువు ఇస్తున్నారు ప్రేమసాగరం లో టెయిన్ జయపాల్ (దర్శక నిర్మాత టి రాజేంద్రన్)కు ఈయన గాత్రదానం బహుముఖ ప్రశంసలందుకుంది

ఈయన వెండితెర మీద కొన్ని చిత్రాల్లోనూ నటించారు శ్రీకృష్ణావతారం లో వసుదేవుడుగా చిక్కడు దొరకడు లో నాయిక తండ్రి మహారాజుగా శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణు కథ లో శ్రీపుర నాయకుడుగా ఇంకా పూజాఫలం కలెక్టర్ జానకి పోతులూరి వీరబ్రహ్మం వగైరా చిత్రాలెన్నో ఉన్నాయి

ప్రతిఘటన తర్వాత చరణ్‌రాజ్ నటించే పలు చిత్రాలకు ఈయన కంఠాన్నే ఎన్నుకుంటున్నారు

నేను ఎన్నోసార్లు ఈ సినిమారంగం వదలి మా స్వగ్రామం వెళ్ళి అక్కడ వ్యవసాయం ఇతర బాధ్యతలు చూసుకుందామనుకుంటే ఈ చిత్రపరిశ్రమ ఇందులోని నా శ్రేయోభిలాషులు నన్ను వదలిపెట్టడంలేదు 18 సంవత్సరాలు దాటినా నన్నింకా ఇందరు సహృదయులు ఆదరిస్తున్నారంటే అది భగవంతుడు నాకిచ్చిన గాత్రం ఆ తర్వాతే నా కృషి అంటారు దశరథరామయ్య

-జ ఎ జి

అడిగింది పార్వతి

కాస్సేపటికి పెళ్ళికొడుక్కి బ్లడ్ టెస్ట్ యూరిన్ టెస్ట్ మోషన్ టెస్ట్ చేయించి తీసుకురావాలంటారు జపు దిగి ఆ కుర్రాడు టకాటకా లోపలకు రావడం చూస్తే మరికి ఇలాంటి చెత్త ప్రశ్నలు అడగరు ఆ నడక ఆ హుషారు ఆ దివి ఆ బాడీ చూసి అదిరిపోయాను రెండు నిముషాల్లో డ్రెస్ మార్చుకుని స్టయిల్‌గా సిగరెట్టు ఇలా పట్టుకుని చకచకా వస్తూంటే చూడ్డానికి రెండు కళ్ళు చాల్లేదు అని బాబూరావు అంటూంటే బాలు అదిరిపడి అమ్మో! సిగరెట్టు కాలుస్తాడట అంటూ తల్లి వంక తిరిగాడు పార్వతి కూడా దిగాలుగా చూసింది బాబూరావు తమాయించుకుంటూ ఓహో! చూడు పార్వతి! సిగరెట్టు సంగతి నీకు తెలీదే! పొగ నోటితో ఎల్చి ముక్కుతో వదిలితే తప్పు ఆరోగ్యానికి హాని అంతేకాని సిగరెట్టు నోట్లో పెట్టుకుని పొగ నోటితో వదిలేస్తే తప్పుకాదు ఆరోగ్యానికి ఏ హానిలేదు అన్నాడు

## సినిమా



బాలు వెంటనే అయితే రేపట్నుంచి నేనొక్క పేస్తాను సిగరెట్టు నోట్లో పెట్టుకుని పొగ నోటితో వదిలేస్తాను అన్నాడు

ఒళ్ళు మండిపోయింది బాబూరావుకి రేయి బాలూ! ఎరక్కపోయి నీకు బాలసుబ్రహ్మణ్యం అని పేరెట్టానా నువ్వు ముదురు బాలసుబ్రహ్మణ్యానివి

ఛ ఛా!ముదురు వెధవా! అని కొట్టబోగా బాలు తప్పించుకుని, తుర్రుమన్నాడు.

కె. ఎస్. రామారావు సమర్పణలో కె. వెనర్జి నిర్మించిన ప్రమోద్ ఆర్ట్స్ ఫిలిమ్స్ "పుణ్యస్త్రీ" చిత్రానికి రవిరాజా పినిశెట్టి దర్శకుడు.

### బుద్ధిమంతుడు" మురళీమోహన్ సరసన

### జయసుధ, రాధిక

పరోపకార బుద్ధితో కష్టాలు కొని తెచ్చుకొనే బుద్ధిమంతుడుగా మురళీమోహన్‌కు బాగా సూట్ అయిన పాత్ర నారి నారి నడుమ మురారి లాంటి

# ఎల్లప్పుడూ ఆంప్రోనే!

పిల్లలకు
ఆంప్రో అంటే ప్రాణం...
అందుకే ఎప్పుడూ
తయారుగా ఉంచుతాను!
అందులో ఎంతో రుచి,
బలమూకల బిస్కట్లు!

కాస్త ఆగండి...
ఒక్క బిస్కట్టును తినండి.




## ఆంప్రో గ్లూకోజ్ బిస్కట్లు
## ఆంప్రో తో మీకు నాణ్యత ఖాయం.

ట్రయాంగిల్ లవ్ స్టోరి. చివరి షెడ్యూల్ మార్చి 20 నుంచి నెలాఖరు వరకు ఔట్‌డోర్‌లో," అన్నారు ఎన్. రామచంద్రరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జి. జగన్‌మోహన్ సమర్పించే జగన్ ఇంటర్నేషనల్ వారి పై చిత్రంలో మురళీమోహన్, జయసుధ, రాధిక, జె. వి. సోమయాజులు, గిరిబాబు,. నూతన్‌ప్రసాద్ ఎ ఎల్ నారాయణ రమాప్రభ, పుష్పలత రాజ్యలక్ష్మి మమత పాల్గొంటున్నారు. సుదర్శన్ బట్టాచార్య సంభాషణలు చక్రవర్తి సంగీతం ఎన్ ఎస్ రాజు ఛాయ రంగారావు శిల్పం సత్యం ప్రొడక్షన్, సాంబశివరావు కూర్పుతో ఎ కృష్ణమోహన్ సమర్పకులు

## "జీవన పోరాటం"లో

## హిందీనటి మీనాక్షిశేషాద్రి

ప్రముఖ వాణిజ్యవేత్త టి సుబ్బరామిరెడ్డి సమర్పణలో పి శశిభూషణ్ నిర్మిస్తున్న జీవన పోరాటం చిత్రం ద్వారా ప్రముఖ హిందీనటి మీనాక్షి శేషాద్రి తొలిసారిగా తెలుగు ప్రేక్షకులకి పరిచయం కానున్నది

ఈ చిత్రంలో మొత్తం ఆరు పాటలు వున్నాయి. ఈ ఆరు పాటలను శోబన్‌బాబు రాధిక, విజయశాంతి ఊర్వశిలపై చిత్రీకరించడం పూర్తయ్యింది ఇవిగాక రజనీకాంత్, మీనాక్షిశేషాద్రిలపై మరొక డ్యూయెట్‌ని



టి సుబ్బరామిరెడ్డి, మీనాక్షి శేషాద్రి

చిత్రీకరించదలిచాం మీనాక్షి శేషాద్రి తెలుగు చిత్రంలో నటించడం ఇదే ప్రదమం ఈ పాట కోసం అత్యదిక వ్యయంతో మరొక అపూర్వమైన సెట్‌ను వేస్తున్నాం అన్నారు చిత్ర సమర్పకులు టి సుబ్బరామిరెడ్డి

ప్రస్తుతం హైదరాబాద్‌లో షూటింగ్ జరుగుతున్న ఈ చిత్రాన్ని మార్చిలో క్లయిమాక్స్ తీస ఏప్రల్ 10న విడుదల చెయ్యాలని అనుకుంటున్నారు

నటభూషణ శోబన్‌బాబు రజనీకాంత్ శరత్‌బాబు నరేష్ విజయశాంతి రాదిక మినాక్షిశేషాద్రి ఊర్వశి సత్యనారాయణ. రావుగోపాలరావు ఈశ్వరరావు మాడా ప్రసాద్‌బాబు, ప్రతిమటన శ్రీనివాసరావు శుబ శ్రీలక్ష్మి పుష్పలత మొదలైన ప్రముఖ తారలంతా నటిస్తున్న ఈ చిత్రానికి కథ మనోజ్‌కుమార్ మాటలు గణేశ్‌పాత్రో సంగీతం చక్రవర్తి, ఛాయ శివాజి ఎడిటింగ్ రాజగోపాల్ కళ బాస్కరరాజు నృత్యాలు శీను పబ్లిసిటి ఇన్‌వార్క్స్ గీతా నిర్మాణ నిర్వహణ కె సూర్యనారాయణ ఆర్ పద్మనాబన్ నిర్మాణపర్యవేక్షణ వి సుబ్బరాజు దర్శకత్వం రాజాచంద్ర నిర్మాత ఎ శశిభూషణ్ సమర్పణ టి సుబ్బరామిరెడ్డి

## "కలియుగ కృష్ణుడు"గా బాలకృష్ణ

మేనెలలో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు కె మురళీమోహనరావు ఈయన దర్శకత్వంలో ఎ కె వి ప్రసాద్ నిర్మిస్తున్న విశ్వశాంతి ఎంటర్‌ప్రైసెస వారి పై చిత్రంలో బాలకృష్ణ రావ రావుగోపాలరావు గొల్లపూడి మారుతిరావు రంగనాద్ సుదాకర్ నూతన్‌ప్రసాద అల్లు రామలింగయ్య ఎ ఎల్ నారాయణ శారద రమాప్రబ జయమాలిని అనూరాద డిస్కో శాంతి వగైరా తారాగణం ఎం డి సుందర్ కథకు పరచూరి సోదరులు సంభాషణలు చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు నందమూరి మోహనకృష్ణ ఛాయ తోట తరణి హేమచందర్ శిల్పం రఘురాం నృత్యాలు ప్రకాష్ ప్రొడక్షన్ నరసింహారావు కూర్పు కె. రాధాకృష్ణ నిర్మాణ సారథ్యంతో జి. నారాయణదాస్ సహ నిర్మాత




## డైరెక్టర్ రాజశేఖర్, ఆనందనాయుడు సమర్పించే కమలహాసన్ స్వంత చిత్రం "విక్రమ్ 007"

200 గుర్రాలు 200 ఒంటెలతో రాజస్థాన్‌లో అత్యధిక వ్యయప్రయాసలతో చిత్రీకరించిన ఎత్తాక సన్నివేశాలు హాలీవుడ్ చిత్రాల స్థాయిలో ఉంటాయి ఈ చిత్రం కోసం రెండు లక్షల వ్యయంతో ఒక రాకెట్‌ను విమానాన్ని రూపొందించారు పూర్తిగా అండర్ వాటర్‌లో కమలహాసన్ డింపుల్ కపాడియా పాల్గొన్న ఒక నృత్యాన్ని మేనులు పులకరించేలా చిత్రీకరించారు దీనికోసం మద్రాసు గోల్డన్ బీచ్‌లో ఒక పెద్ద ఈతకొలనును ప్రత్యేకంగా నిర్మించారు ఈ చిత్రీకరణలో కంప్యూటర్స్ ఉపయోగించడం జరిగింది గాలిలో కమలహాసన్ సత్యరాజ్ ఎగురుతూ చేసే ఫైట్స్ గగుర్పాటు కలిగిస్తాయి జాణగా కమలహాసన్ ప్రేయసిగా అంబిక రాణిగా డింపుల్ కపాడియా ఆమె సోదరుడుగా అమ్జాద్‌ఖాన్ మరో నాయికగా కొత్త తార లిజా అద్భుతంగా నటించారు ఈ చిత్రం రికార్డ్ సృష్టిస్తుందని నా అంచనా అన్నారు చిత్తూరులోని వెంకటేశ్వర ఆనంద్ ఎ సి థియేటర్ల అధినేత ఆనందనాయుడు ఈయనా డైరెక్టర్ రాజశేఖర్ సమర్పించే ఈ విశిష్టమైన చిత్రాన్ని రాజకమల ఇంటర్నేషనల్ పతాకంలో కమలహాసన్ తెలుగు తమిళ భాషల్లో తయారవుతున్న నిర్మించారు బెంగుళూరులోని ప్రముఖ కంప్యూటర్

## సినిమా

విజర్త ఎపాతంచన ఆత్రేయ గీతాలు ఇళయరాజా సంగీతం రంగా రావు ఎమ్వెస్ రాముని సాహసాలు విరల్ ఛాయతో వి వి ఎలిమ సర్వ్యాంట్ బానర్‌లో ఏప్రిల్ విడుదల

నా కప్పరు ఎల్లులు – ఓహారో ఓహారోయిన్!



## "పరాజిత లో పంతులి పాట్లు

తెలుగు మాస్టారు (సత్తిబాబు) క్లాస్‌లో కొచ్చి కూర్చున్నా విద్యార్థులు అల్లరి చేస్తున్నారు మాస్టారు విసుగ్గా నిశ్శబ్దం! సద్దు సద్దు తెలుగు గడ్డ మీద పుట్టారు గట్టిగా నన్నయ్య ఎవరంటే తెలీదు ఎలా పైకొస్తారయ్యా మీరు? చెప్తానోయ్ చెప్తాను మీ పని ఆఁ తెలుగు రాజ్యాన్ని పాలించిన గొప్ప రాజెవరో చెప్పవోయ్? అని ప్రశ్నించాడు

శ్రీ ఎన్టీ ఆర్ అన్నాడొక అబ్బాయి లేచి నిలుచొని

సద్దు - సద్దు ఆయన ప్రజా ప్రతినిధి రాజు కాదు ఆ మాత్రం అర్థంకాలేదు మీకు అమరావతి ఎక్కడుంది? అందులో ఏమున్నాయ్?

ప్రభు (చక్రవర్తి) అనే విద్యార్థి లేచి ఓస్ ఇంతేనా? అమరావతి నాన్ వెజిటేరియన్ హోటల్ మద్రాసులో మూడు బ్రాంచీలున్నాయి అందులో దొరికేవి చికెన్, అమరావతి ప్రాన్స్, వగైరా వగైరా అని జవాబిచ్చాడు

నేటి విద్యార్థుల తెలివితేటలు ఇలా అఘోరిస్తున్నాయని ముఖం పెట్టాడు మాస్టారు

తాతినేని ప్రసాద్ దర్శకత్వం వహించిన లక్ష్మీపద్మావతి ఫిలిమ్స్ పరాజిత చిత్రానికి అనిల్‌కుమార్ తిరుపతిరాయుడు నిర్మాతలు □



కె.యస్.రామారావు
సమర్పించు
ప్రమోద ఆర్ట్ ఫిలింస్
పుణ్యస్త్రీ
స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: రవిరాజా పినిశెట్టి నిర్మాత: కె.బెనర్జీ
చక్రవర్తి· సాయినాథ్· కె.ఎస్.హరి కోటగిరి వెంకటేశ్వరరావు.

# అభిమాన తారలపై అభిప్రాయం

తెరపైనే కాక నిజజీవితంలో కూడా సాహసవంతుడు కృష్ణ నా అభిమాన నటుడు లిప్ మూమెంట్ లోనూ, నృత్య సన్నివేశములలోనూ ఎక్కువ శ్రద్ధ చూపాలి కేవలము విప్లవాత్మక పాత్రలకె కాక హాస్యము, సెంటిమెంటు ఉన్న పాత్రలకు ప్రాధాన్యత ఇవ్వాలిని కోరుతున్నాను గంబీరమైన కృష్ణమ నాయుడు జమదగ్ని లాంటి పాత్రలే కాకుండా కరుణరసపూరిత మైన పాత్రలలో



కూడా జీవించాలి దర్శకుడిగా తెలుగు చలన చిత్ర పరిశ్రమను క్రొత్త దనమువైపు తీసుకు వెళ్ళాలి నిర్మాతగా వెరైటీగల సబ్జక్టులను తెలుగు ప్రేక్షకుల ముందుంచాలి మహిళల మన్ననలు పొందే సరికొత్త పాత్రలలో నటించి, మెప్పించి ఇప్పుడున్న "ఇమేజ్"ను పటిష్టము చేసుకోవాలి. తన స్థాయికి, వయస్సుకు తగిన పాత్రలలో నటించి ప్రేక్షకుల మన్ననలు పొందాలి.

–వి. సత్యనారాయణ, బిళ్ళనందూరు

★ ★ ★

మా అభిమాన నటుడు, యువకిశోరం నందమూరి బాలక్రిష్ణగారు. ఆయన నటించిన చిత్రములన్నియు నేను తప్పకుండా చూస్తాను. వారు "తండ్రిని మించిన తనయుడు"గా సినీ పరిశ్రమలో ముందడుగు వేయుచున్నారు. ఎందువలన అనగా శ్రీ రామారావు గారు సినీ పరిశ్రమలో శ్రీకృష్ణుని పాత్రకు సాటి మరొకరు లేరని నిరూపించారు. అంతటి



ఘనత కుమారునికి దక్కింది. ఈ మధ్య విడుదలైన చిత్రము 'పట్టాభిషేకం"లో శ్రీకృష్ణునిగా చూస్తుంటే నిజముగా రామారావుగారు గుర్తుకు వచ్చారు ఫైట్స్‌లో క్రొత్త రకాలుగా వీరు చాల నేర్చుకొనినారు వారు సినీ జగత్తులో నే మకుటము లేని మహారాజుగా వుంటారని, తండ్రి తరువాత కుమారుడు సినీరంగములో హీరోలాగా వెలుగుతారని నా అభిప్రాయం మంచి హృదయం గల మనిషి రాముడు శ్రీకృష్ణుని పాత్రలు ఇక ముందూ వేస్తారని ఆశిస్తున్నాను

-ఎస్ కె సుబానీ, పోలకంపాడు

★ ★ ★

కృష్ణంరాజుగారు నటించిన చిత్రాలలో నాకు నచ్చినవి మనవూరి పాండవులు అమరదీపం, భారతంలో శంఖారావం బొబ్బిలిబ్రహ్మన్న, అగ్గిరాజు, కల్యాణచక్రవర్తి కురుక్షేత్రము (కర్ణుడు) భక్తకన్నప్ప గోల్కొండ అబ్బులు మచ్చుకు తొమ్మిది తొమ్మిదీ విబిన్న పాత్రలు ఆయన సాంఘిక, పౌరాణిక చిత్రాలకు గూడ న్యాయం చేకూర్చగల మేటి నటుడనుటలో అతిశయోక్తి లేదు

ఇటీవల కొందరు దర్శకులు శ్రీ ఎన్ టి రామారావు గారికిచ్చు పాత్రలకు కృష్ణంరాజు న్యాయం చేకూర్చగల దిట్ట అని తెల్పినారు ఇది గర్వించ తగు విషయమే' కాని శ్రీ కృష్ణంరాజుగారు తమ నటనను కళామతల్లికి అంకితము చేసి వ్యాపార సరళిలో నిర్మించు చిత్రాలలో పనికిరాని చెత్త పాత్రలను



ఎన్నుకోకూడదని మనవి

ప్రస్తుత స్వార్థపూరితమగు, కుళ్ళు, నీచాతినీచంగా తయారయిన రాజకీయాల జోలికి వెళ్ళకూడదని నా ప్రార్థన

ఎన్ ఎస్ ఎం జ్ఞానమూర్తి, పామిడి

★ ★ ★

ముఖ కవళికలలో నిర్దిష్టమయిన భావుకతను అబినయాన్ని ప్రదర్శిస్తూ, సమయస్ఫూర్తితో తనకిచ్చిన పాత్రలో నటించటంలేదు జీవిస్తుందని ప్రతి ప్రేక్షక హృదయాన్ని స్పందింపచేయ గల సామర్థ్యాన్ని కల్గివున్న అతి కొద్దమంది నటీమణుల్లో అగ్రతాంబూలాన్ని అందించవచ్చు ఈ నా అబిమాన తారకు ఎటువంటి క్లిష్టమయిన సన్నివేశాన్నయినా అతి సహజంగా నటించగల నటనా కౌశలం ప్రస్ఫుటమయిన వాచకం నవరసాల్లోని ఏ రసాన్నయినా చక్కని బావ ప్రకటనతో పోషించి, మెప్పించి, పది కాలాలపాటు ప్రేక్షకుల మనసుల్లో పదిలమయిన చోటు సంపాదించుకుంది ఈ అబినవ నటరాగ్రేశ్వరి, నటనలో తనదంటూ ఒక బాణీని ఏర్పరచుకుని తనకు తానే సాటి అని నిరూపించుకుంది పలు చిత్రాల్లో బావగర్భితమయిన శోక సన్నివేశాల్లో ప్రేక్షకలో కొన్ని శోకతప్తులను చేస్తూ తనకంటూ ఒక నిక్షేపమయిన సుస్థిర స్థానాన్ని సంపాదించుకోగలిగింది ముఖ్యంగా నారి హృదయాలలో అబిమాన ప్రేక్షకుడిగా ఆమెకు కొన్ని సలహాలు ఇస్తున్నాను పాత్రోచితంగా చక్కని దుస్తులు ఎన్నుకోవటం, మేకప్ మరియు హెయిర్



స్టయిల్ విషయాల్లో తగు జాగురూకత పహించటం తగిన హీరోలు గల చిత్రాల్లో నటించకపోతే ఈమె నటన అడవి కాసిన వెన్నెలవుతుంది ఇంతకీ ఈ అబినయ రసాల సాల నవదీపిక ఎవరు? ఆమెయే సుధారస మనోజ్ఞ నాయిక, అబినేత్రి జయసుద

-గుండా వెంకటేశ్వరరావు,
మధురానగర్, విశాఖపట్నం

★ ★ ★

విప్లవకారుడి పాత్రలలో శివకృష్ణ అత్యద్భుతంగా నటిస్తారు. ముందడుగు, సంఘర్షణ చిత్రాలలో శివకృష్ణ నటన మరువరానిది. విప్లవకారుడి పాత్రలో ఆయన నటిస్తారనటం కంటే జీవిస్తారనటమే సబబు. డైలాగ్ డెలివరీ ఎంతో సహజంగా వుంటుంది. ప్రేక్షకులకు భావోద్రేకం కలుగుతుంది.

ఈ చరిత్ర ఏ సిరాతో, ఇది కాదు ముగింపు మొదలగు చిత్రాలలో శివకృష్ణ ఆ పాత్రలకు పూరి



న్యాయం చేకూర్చారు. విప్లవకారుడి పాత్రలే వేయాల్సి వస్తాయేమోనని ఆయన ఈ మధ్య అటువంటి పాత్రలలో కనుపించుటలేదు ఆయన నటించే చిత్రాలలో సగ బాగం విప్లవకారుడి పాత్రలు ఉండాలని నా సూచన

శివకృష్ణగారు 'బగత్‌సింగ్'గా నటిస్తే చూడాలని ఉంది

–తుమ్మా వేణు, పాత మంగళగిరి

చలన చరిత్ర సమలో తన అసమాన నటనను ప్రదర్శించి అఖిలాంధ్ర ప్రేక్షకుల మన్ననను పొంది మూడు సార్లు ఊర్వశి అవార్డు అందుకున్నన అబిమానతార శారద ఏ పాత్రనయినా ఛాలెంజ్‌గా తీసుకుని ఆ పాత్రలో లీనమై నవరసాలు పలికించి అబిమానులచే ప్రేక్షకులచే శబాష్ అని పించుకొగల నటనా సామర్థ్యం కలనటి ముఖ్యంగా చండ శాసనుడు వంటి చిత్రంలోని పాత్రను సమర్ధవంతముగా పోషించి ఎన్ టి ఆర్ వంటి మహానటుని చే శబాష్ అనిపించుకున్న తార శారద ఇప్పటి వరకూ ఎన్నో మంచి పాత్రలను దరించి అందరి మన్ననలను, అబిమానాన్ని చూరగొన్న శారద బవిష్యత్‌లో కూడా వచ్చిన ప్రతి పాత్రను పోషించకుండా నటనను ప్రదర్శించడానికి ఎక్కువ అవకాశం ఉన్న పాత్రలను ఒప్పుకుని తన ఇమేజ్‌ను



కాపాడుకుంటూ భవిష్యత్‌లో అగ్రనాయకుల అభిమానుల, ప్రేక్షకుల మన్ననలను పొందాలని నా ఆకాంక్ష.

–గుత్తుల పద్మావతి
రావుల చెరువు, అమలాపురం

నా అభిమాన అందాల నటుడు యువకిశోర్ నందమూరి బాలకృష్ణ. "డిస్కో కింగ్"గ "సాహసమే జీవితము" అని "మంగమ్మగారి మనవడు" "కథా నాయకుడు" గ "పట్టాభిషేకం" చేసుకొన్న "ముద్దుల



కృష్ణయ్య". ఎప్పుడు ఒకే తరహా పాత్రలు, పోరాటములు చేయకుండా కుటుంబ కథాచిత్ర-ములు, పౌరాణిక జానపద చిత్రములలో కూడ నటించి పేరు తెచ్చుకొంటే పరిశ్రమలో వారినుండి; అందరి అభిమానుల నుండి అభినందనలు అందుకొంటారు. అందరితో నటించిన బాలకృష్ణ త్వరలో శ్రీదేవి, జయప్రదలతో చూడాలని ఉంది త్వరలో విడుదల కానున్న ఇతని చిత్రములు "దేశోద్ధారకుడు" "కలియుగ కృష్ణుడు" "అశ్వమేధము" విజయము చేకూరాలని ఆశిద్దాము. డైలాగులు చెప్పేటప్పుడు కొంచెము తల వూపుతాడు. క్రొత్తలో చాల ఉంది ఆ అలవాటు. ఇప్పుడు కొంచెము పర్వాలేదు. త్వరలో "సూపర్ స్టార్" కావాలన్నది మా అందరికోరిక.

–గుమ్మడి శోభారాణి,
పెద్ద బజారు, పూనూరు

నేను అమితంగా అబిమానించే నటి విజయశాంతి అనతి కాలంలో నే తన నటనా ప్రతిబతో చలన చిత్ర పరిశ్రమలో తనకంటూ ఓ ప్రత్యేకమైన స్థానాన్ని సంపాదించుకుంది

ఈమద్య విడుదలైన 'ప్రతిఘటన' ఆమె నటనా జీవితంలో ఒ మ్మ్రుతునక ఈ చిత్రంలో విజయశాంతి పోషించిన లెక్చరర్ ఝాన్సీ' పాత్ర ఆమెను ఉన్నత శిఖరాలమీద కూర్చుండబెట్టింది ప్రేక్షకులలో ఆమె పట్ల ఉన్న ఇమేజీని ఊహించని రితిలో పెరిగేటట్లు చేసింది

వందేమాతరం 'లో డాక్టరుగా పండాగా నటించి ఎటువంటి పాత్రనైనా అవలీలగా పోషించగల సమర్ధురాలనిపించుకున్నది

ఇలాగే వైవిధ్యమున్న పాత్రలను పోషిస్తూ,



అఖిలాంధ్ర ప్రేక్షకుల హృదయాలలో చిరస్థాయిగా నిలిచిపోవాలని, ఈ సంవత్సరం "సూపర్ హీరోయిన్" కాగలదని ఆశిస్తూ.

-బిట్రా శోభారాణి, పేరాల, చీరాల □

సీరియల్

# చైతన్య స్వరూపం

కంచుమర్తి వెంకటేశ్వర రావు

(గత సంచిక తరువాయి)

"యువరానర్ ఈ కేసులో ముఖ్యమైన సాక్ష్యం హత్య జరిగిన సమయంలో ఉన్న వ్యక్తి గాయత్రిగారిని ప్రవేశ పెట్టవలసిందిగా కోరుతున్నాను

గాయత్రి బోనులో నిలబడింది

చూడండి గాయత్రి గారూ కిరణ్ ఫాన్సీ స్టోర్సులో ఎన్ని రోజులు పని చేసారు

రెండు నెలలు

ఈ రెండు నెలల్లో కిరణ్ ఎప్పుడయినా అల్లరిగా ప్రవర్తించాడా?

లేదు

అటువంటప్పుడు పని చేయడం మానేస్తున్నానని స్వరూపగారికి చెప్పారట ఎందుచేత?

గాయత్రి మాట్లాడ లేదు

చెప్పండి గట్టిగా అడిగింది హరిత

రెండు నెలల్లో కిరణ్ ఎప్పుడూ అల్లరిగా ప్రవర్తించకపోయినా ఈ సంఘటనకు మూడ్రోజులకు ముందు నుండి నన్ను తన దార్లోకి రమ్మని బలవంతంగా అడగటం మొదలు పెట్టాడు అంతే షాపులో మానివేయాలని నిర్ణయించుకున్నాను అదేమాట స్వరూపగారితో చెప్పాను

గాయత్రి గారూ షాపుకు మరి రానని చెప్పిన మీరు మర్నాడు షాపుకు వెళ్ళారా?

వెళ్ళలేదు

అయితే రాత్రి తొమ్మిది గంటలకు షాపు డాబామీది గదిలో స్వరూపగారి ప్రక్కన మీరున్నారు ఆ సమయంలో అక్కడ మీరు ఎందుకు ఉన్నారు? ఎందుకు వెళ్ళారు మిమ్మల్ని మానభంగం చేయడానికి ప్రయత్నించాడని

**జరిగిన కథ–11** స్వరూప కొడుకు కిరణ్‌కి తల్లి అంటే ప్రాణం పరాంకుశం కిరణ్‌కి త్రాగుడు అలవాటు చేస్తాడు త్రాగుడేకాక అమ్మాయిలతో షికార్లు కూడా ప్రారంభిస్తాడు కిరణ్ కొడుకు చేత ఒక ఫ్యాన్సీ షాపు తెరిపిస్తుంది స్వరూప ఆ ఫ్యాన్సీ షాపులో సేల్స్ గర్ల్‌గా చేరుతుంది గాయత్రి ఆ అమ్మాయంటే స్వరూపకి అభిమానం ఒక రోజు గాయత్రి వచ్చి షాపులో పని మానివేస్తున్నానని చెప్పిన మాట విని స్వరూప ఆశ్చర్యపోతుంది కిరణ్ గాయత్రిని మానభంగం చేయడానికి ప్రయత్నిస్తున్న సమయంలో చూసిన తను కిరణ్‌ని చంపేశానని హరితతో చెప్తుంది స్వరూప కానీ హరిత నమ్మదు తన తల్లి స్వరూపేనని తెలుసుకొంటుంది హరిత లాయర్ హరిత కోర్టులో స్వరూప తరఫున వాదించటం మొదలు పెడుతుంది

స్వరూపగారు చెప్పారు నిజమేనా?

షాపుకు మరి రానని చెప్పాను అయితే ఆ నెల జీతం నాకు రావలసింది ఉంది అది అడగడానికి ఉదయం వెళ్ళితే ఇప్పుడు బిజీగా ఉంది షాపు మూసే ముందు రమ్మని చెప్పాడు కిరణ్ ఆ రాత్రి ఎనిమిదిన్నర తర్వాత వెళ్ళాను షాపు తక్కువ తొమ్మిదివరకు ఉన్నాను పని కుర్రాళ్ళను ఇళ్ళకు పంపించేసి మేమిద్దరం లోపల ఉండగానే తలుపు వేసి గడియ పెట్టాడు ఆ సమయంలో నేనెంత అరిచినా బయటకు వినిపించదు కిరణ్ ఉద్దేశాన్ని గ్రహించిన నేను చాలాసేపు పెనుగులాడేను కొన్ని సామాన్లు డబ్బాలు క్రింద పడ్డాయి ఆ శబ్దమైన బయటివాళ్ళకు వినిపిస్తుందనే ఆశ

కిరణ్ బలవంతంగా ఎత్తుకుని డాబామీదున్న స్టోర్ రూంకి తీసుకెళ్ళాడు ఆ పెనుగులాటలో నా చీర మొత్తం చిరిగిపోయింది నన్ను నేను రక్షించుకోవడానికి

అని ఆగిపోయింది గాయత్రి

అప్పటికే అందరి దృష్టి గాయత్రి మీదే ఉంది

జడ్జిగారు కూడా ఆమెనే చూస్తున్నారు

ఏం చేసారు మీరు చెప్పండి

గట్టిగా అడిగింది హరిత

ఇక గత్యంతరంలేక పేకింగులు తయడానికి ఉపయోగించే పెద్ద కత్తి నా చేతికి దొరికింది, దాంతో నా కసితీరా కిరణ్‌ను ఆరేడుసార్లు పొడిచాను చచ్చేవరకు అప్పటికే నా బట్టలు రక్తసిక్తమయ్యాయి

కోర్టులో కలకలం మొదలయింది

ఈ అమ్మాయి హత్య చేసిందా?

స్వరూప కాదా?

అప్పుడే స్వరూపగారు పైకి వచ్చారు నేనలాగే నిలబడి ఉన్నాను స్వరూపగారు మెట్లు దిగి ఒక పేకెట్‌లో ఉన్న చీరను తెచ్చి గాయత్రి ముందు ఆ చీర వేస్కో అన్నారు

ఎందుకో నాకర్థం కాలేదు

రక్తంతో గిలగిల కొట్టుకుని చనిపోయిన కొడుకును కూడ సరిగ్గా చూడలేదు రవంతయినా చలించలేదు కత్తి అక్కడ పడేసి చేతులు కడుక్కోమన్నారు ఒంటిమీద ఒక్క రక్తపు బొట్టయినా లేకుండా శుభ్రం చేసుకోమన్నారు అలాగే చేసాను వెంటనే చీర కట్టుకున్నాను రక్తం అంటిన చీరను కాగితం పొట్లంలో కట్టి పేకింగ్‌ల మూలల్లో దాచేసాను

స్వరూపగారు కత్తిని చేతుల్లోకి తీసుకుని క్రిందకు దిగి పోలీసు స్టేషన్‌కు ఫోన్ చేసి మళ్ళి అక్కడకు వచ్చారు

గాయత్రి పోలీసులు రాగానే హత్య నేనే చేసినట్లు చెప్పు అన్నారు

స్వరూపగారు ఎందుకలా చేస్తున్నారో నాకు తట్టేలోపలే పోలీసులు వచ్చారు

అని చెప్పడం ఆపింది గాయత్రి

అందరూ ఆశ్చర్యంతో అలాగే వింటుండిపోయారు

డిఫెన్స్ లాయరు లేచి యువరానర్ స్వరూపగారిని శిక్ష నుండి తప్పించడానికి గాయత్రిగారు చిన్న కట్టుకథ చెప్పారు ఫాన్సీ స్టోరులో చీరలు అమ్ముతున్నారనే సంగతి వింతగా అనిపిస్తోంది నాకు ఫాన్సీ స్టోరులో ఉన్న చీర పేకెట్ తెచ్చి స్వరూపగారు గాయత్రి గారికి ఇచ్చారనేది కట్టుకథగా గాక నిజమని నమ్మమంటారా?

హరిత సందిగ్ధంలో పడింది

కాని గాయత్రే అంది–

యువరానర్ నాలుగు రోజుల క్రితం అంటే హత్య జరిగిన నాల్గు రోజుల క్రితం అప్పటికి నేను ఫ్యాన్సీ స్టోరులోనే పని చేస్తున్నాను ఆ రోజు సాయంత్రం కిరణ్‌గారు బయటకు వెళ్ళి మదర్‌కోసం చీరకొని ఆ పేకెట్‌ను షాపులోనే ఉంచేసారు రెండ్రోజుల వరకు ప్రతీసారి ఇంటికి తీసుకెళ్ళాలి అంటూనే మరచిపోవడం నేను చూస్తూనే ఉన్నాను హత్య జరిగిన ముందు రోజు షాపులో పనిచేసే కుర్రాడికి కూడా చెప్పారు ఇంటికి వెళ్ళేముందు పేకెట్ సంగతి గుర్తు చేయమని అయితే ఆ సాయంత్రమే నేను పనికి రానని చెప్పి స్వరూపగారి

దగ్గరకు వెళ్ళి చెప్పాను ఆ మర్నాడు ఇది జరిగింది ఆ చీర కొన్న సంగతి నాకే కాదు షాపులో పని చేసిన కుర్రాళ్ళకూ తెలుసు ఇంకా వివరాలు కావాలంటే కిరణ్ పాన్సీ స్టోరుకు దగ్గరలో ఉన్న రామచంద్రా క్లాత్ షోరూంని అడగండి చీర ఖరీదు రెండువందల యాభైరూపాయలు

డిఫెన్స్ లాయరు తగ్గాడు

హరితకు సంబరంగా ఉంది

ఇంతలో పోలీసు డిపార్టుమెంటు సేకరించిన వేలి ముద్రలు పరిగణలోకి తీసుకున్నారు వితిన్ సెకండ్స్‌లో కిరణ్ ప్యాన్సీ స్టోరుకు వెళ్ళి పేకింగ్‌ల మూలల్లో దాచిన రక్తం అంటిన చీరను తీసుకు రమ్మని ఆర్డరు జారి చేసారు

అయితే కిరణ్‌ను మిరే హత్య చేసారన్నమాట స్వరూపగారు కాదు అని అడిగారు జడ్జి

అవును నేనే చేసాను

అంది గాయత్రి

జడ్జిగారు స్వరూపను చూసారు స్వరూప తల వంచుకుని నిలబడింది

పది నిముషాల్లో పోలీసులు పాన్సీ స్టోరులో పేకింగ్‌ల మూలల్లో ఉంచిన రక్తం అంటిన చీరను తీసుకొచ్చారు వేలి ముద్రల పరిశీలనలో గాయత్రి అని తేలింది

గాయత్రి హత్య చేసినా ఆ నేరం మి మిద వేసుకోవడంలో మి ఉద్దేశ్యం ఏమిటి?

జడ్జిగారి ప్రశ్నకు జవాబు చెప్పలేదు స్వరూప

హరిత కల్పించుకుంది

యువరానర్ స్వరూపగారి జవాబు వచ్చే లోపల గాయత్రే హత్య చేసిందని నిర్ధారణ చేయడానికి డిఫెన్స్ లాయరు అడిగిన చీర గురించి చెప్పడానికి ముందుకు వస్తున్న రామవేంద్ర అనే సాక్షిని ప్రవేశపెట్టి అతని నుండి నిజం తెలుసుకోడానికి అనుమతి ఇవ్వవలసిందిగా కోరుతున్నాను

యస్ పర్మిషన్ గ్రాంటెడ్

రాఘవేంద్ర బోనులో నిలబడ్డాడు

రామవేంద్రగారు గాయత్రి మి అమ్మాయే కదా'

అవును'

కిరణ్ పాన్సీ స్టోర్సులో పని చేయనని చెప్పి ఆ మర్నాడు రాత్రి అక్కడకు వెళ్ళింది మళ్ళీ ఇంటికి ఎప్పుడు వచ్చింది

ఎనిమిదిన్నర ప్రాంతంలో బయటకు వెళ్ళిన గాయత్రి రాత్రి పన్నెండు గంటలకు వచ్చింది ఎందుకమ్మా లేటయిందని గాబరాగా అడిగాను అయితే అప్పటికే గాయత్రి బయంతో వణికిపోతుంది వెళ్ళేటప్పుడు ఒక చీర వచ్చినప్పుడు కొత్త చీర అనుమానంతో అదే అడిగాను

దార్లో కొన్నాను నాన్నగారూ ప్రెండు బలవంతం మిద అక్కడే కొత్త చీర కట్టుకున్నాను అంది

అయితే నేను నమ్మలేకపోయాను

రెండ్రోజుల వరకు ఆలోచిస్తూ, అప్పుడప్పుడు బయంతో వణికిపోతున్న గాయత్రిని అడిగాను అసలు ఏం జరిగిందని అప్పుడు ిదంతా చెప్పింది హత్య చేసాను నాన్నా అని కుమిలి కుమిలి ఏడ్చింది

అది చెబుతున్నప్పుడు రామవేంద్ర కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి

రామవేంద్రగారూ కూతురే హత్య చేసిందని చెబుతున్నారు ఎలా చెప్ప గలుగుతున్నారు?

చేసిన తప్పును కప్పి పుచ్చడం ఇష్టం లేక కృతజ్ఞత కూడా ఉంగి

ఈసారి అందరూ ఆశ్చర్యపోయారు

కృతజ్ఞత ఏ విషయంలో ?

సుమారు ఇరవై సంవత్సరాల క్రితం మాది ఈ ఊరుకు దగ్గరలో ఉన్న






**టి యమ్ ఎ, మండపేట**

నా వీపు మీద, మెడ మీద శోబి మచ్చలు వచ్చినాయి స్కిన్ స్పెషలిస్టుకి చూపించితే క్రామెటన్ ఆయిల్ వాడమన్నారు వాడిన తర్వాత తగ్గినాయి కానీ మరల వస్తున్నాయి చాలా మందులు వాడాను

విటిలైగో అనే రోగం వల్ల వచ్చిన మచ్చలు పోవటం అరుదు పంగస్ ఇన్‌ఫెక్షన్ వల్ల ఏర్పడిన పొడలు తప్పక నయమవుతాయి చర్మ వైద్యులు చికిత్సా విదానాన్ని నిర్ణయిస్తారు ప్రత్యక్షంగా చూడనిదే చికిత్స చెయ్యటం కష్టం

**జె వి కె–విజయవాడ**

మూలశంక వ్యాది తగ్గటానికి ఏం వాడాలి? ఆ వ్యాది వున్న వాళ్ళు తిండి కూడా మార్చాలా?

మలవిసర్జన సులభంగా అవటానికి ఆకుకూరలు మొదలయిన వాటిని వాడటం అవసరం మరీ మలబద్ధకం ఎక్కువగా ఉంటే లిక్విడ్ పారపిన్ వాడటం అవసరం

సర్జన్లచేత పరీక్షింప చేసుకొని వారి సలహా మేరకు చికిత్స చేయించుకోవలసి ఉంటుంది

**బి జి–ఆకివీడు**

నా వయస్సు 52 సంవత్సరములు బి పి వుంది 4 సంవత్సరముల నుండి ఎడమ చెయ్యి నెప్పి వున్నది ఆ నెప్పి కూడా రోజూ వుండదు అప్పుడప్పుడు విపరీతమైన నెప్పి వస్తూ తలనొప్పి, మెడ నెప్పి కూడా వస్తున్నాయి గుండె నెప్పి వస్తుంటే ఇ సి జి తీసినారు ఎందరో డాక్టర్లకు చూపించి మందులు వాడుతున్నా ఈ చెయ్యి నెప్పి తగ్గటం లేదు

**ఆర్థోపీడిక్ వైద్యులకి చూపించి చేతి నెప్పికి చికిత్స చేయించుకోవటం మంచిది. అదే సమయంలో రక్తపుపోటు మాత్రలు వాదకం మానకూడదు**

**బి. ఏ. యస్., పిఠాపురం**

టి బి వ్యాధి ఎందుకు వస్తుంది? వచ్చిన తర్వాత మందులు వాడి పూర్తిగా నయం అయిన తర్వాత బవిష్యత్తులో ఎప్పుడూ రాకుండా వుండడానికి ఎటువంటి జాగ్రత్తలు తీసుకోవాలి? ఈ వ్యాధి శరీరంలో వున్నంత కాలం చర్మము మెత్తపడుతుందా? ఒకసారి టి బి ఎటాక్ అయినవాళ్ళకి శరీరం ఎప్పుడూ మెత్తగా వుంటుందా?

మైకోబాక్టీరియా ట్యూబర్కులోసిస్ అనే సూక్ష్మక్రిమి వల్ల క్షయ రోగం వస్తుంది

వైద్యులు సూచించినన్నాళ్ళు మందులు వాడితే మళ్ళీ వచ్చే ప్రసక్తే వుండదు మంచి ఆహారం తీసుకోవటం అవసరం

ఈ రోగానికీ శరీరం మెత్తబడటానికీ సంబంధంలేదు □

## చైతన్య స్వరూపం

చిన్న పల్లెటూరు . పేద రైతు కుటుంబం మాది ముగ్గురన్నదమ్ములు. ఒక చెల్లెలు. పెద్దవాడిని నేను అప్పటికి నా పెళ్ళయి సంవత్సరమైంది నా పెళ్ళయిన రెండు నెలలకే మా మేనమామగారి అబ్బాయితో పెద్దగా కట్నాలు లేకుండానే నా చెల్లెలు పెళ్ళి జరిపించాం అయితే పెళ్ళయిన రెండు నెలలకు జబ్బుతో మంచం ఎక్కింది నా చెల్లెలు పట్నంలోని డాక్టర్లకు చూపిస్తే తగ్గుతుందన్నారు రెండు మూడు సార్లు చూపించాం అయితే ఖరీదైన మందులకు, ఫీజులకు మాదగ్గర అంత తాహతు లేదు పట్నంలోనే పెద్ద ఉద్యోగం చేస్తున్న మా చెల్లెలు భర్త నెలకో వందో రెండొందలో పంపించేవాడు తప్ప భార్యను తీసుకుని వెళ్ళి ట్రీట్ మెంట్ చేయిస్తాననే వాడు కాదు

భర్త తీసుకెళ్ళడం లేదనే బెంగతో మరింత చిక్కి శల్యమైంది నా చెల్లెలు అప్పటికి నేను ఎలిమెంటరీ స్కూలు టీచరుగా నూటా యాభై రూపాయల జీతం సంపాదిస్తున్నాను నా భార్య గర్భవతి ఈ పరిస్థితిలో చెల్లెలు మందులకు ఎక్కువగా ఖర్చు పెట్టలేక పోయేవాడిని

ఇదిలా ఉండగా నా చెల్లెలు మరి సంసారానికి పనికి రాదని స్వయాన మేనమామ అయినా మరేం ఆలోచించకుండా కొడుక్కి మళ్ళీ పెళ్ళి చేయడానికి సిద్దపడ్డాడు ఎవరు ఎన్ని రకాలుగా బ్రతిమాలినా వినిపించుకోలేదు మరి రెండు నెలలకు

ఒక రోజు స్వరూపగారు మా ఊరు వచ్చారు

అసలు విషయం మరచి పోయాను చెల్లెలు బర్త పేరు వర్మ కాలేజీలో లెక్చరరు

స్వరూపగారు వచ్చి అసలు సంగతి చెప్పగానే మా ఇంట్లో వాళ్ళంతా ఆనందంతో పొంగిపోయారు

అమ్మా మా అమ్మాయి సంసారం బాగుపడితే నీ మేలు ఈ జన్మలో మరచి పోలేం అని మా అమ్మా, నాన్న స్వరూపగారికి చేతులెత్తి దండం పెట్టారు

నేనూ, నా తమ్ముళ్ళు స్వరూపగారికి నమస్కరించాం

కన్నీళ్ళొచ్చేలా కృతజ్ఞతలు చెప్పుకున్నాం

స్వరూప గారు మా చెల్లెలును తీసుకెళ్ళారు

నాల్గు రోజులకు చెల్లెలు బర్తతో సుఖంగా సంసారం చేస్తుందని, ఖరీదైన డాక్టర్లకు చూపించి మందులు వాడుతుందని, వర్మ పూర్తిగా మారి పోయాడని తెలిసింది

స్వరూపగారు మా కుటుంబానికి చేసిన సహాయం ఎవ్వరూ మరచ పోలేం

అటువంటి స్వరూపగారు ఈ రోజు నా కూతురు హత్య చేసినా ఆ నేరం తన మీద వేసుకోడానికి సిద్ధమయిందంటే ఆమె గొప్పతనాన్ని, త్యాగనిరతిని పొగడలేం అయితే తప్పు చేసిన వాళ్ళని క్షమించగలిగి వారి జీవితాలలో ఆనందాన్ని నింపగల స్వరూపగారు ఏతప్పు చేయకుండానే శిక్ష వేయమని అడుగుతుంటే నిజాన్ని దాచి ఆమెను బాధ పెట్టి నాకూతురును శిక్షనుండి తప్పించుకోవాలనే ఆశలేదు .

కోర్టులో పింద్రాప్ సైలెన్స్

"చూడండి స్వరూపగారూ గాయత్రి చేసిన హత్యను మీ మీద వేసుకోవడంలో గల కారణాలేమిటి? మీ కొడుకునే చంపిన గాయత్రిపై కోపం పెట్టుకోకుండా ఆమెను రక్షించా రెందుకు

చాలా మంది ఆసక్తిగా స్వరూపనే చూస్తున్నారు.

అందరికీ వింతగా, విడ్డూరంగా ఉంది

ఆమె ఏం చెబుతుంది?

జీవితంలో అన్ని రకాలుగా ఓడిపోయి చావుమీద మోజుతో ఉన్నాను నేను ఇప్పుడిప్పుడే జీవితం, అంటే ఏమిటో తెలుసుకుని అందులోని చేదు తీపిలను ఆస్వాదించే వయసులో ఉంది గాయత్రి బ్రతికే అవసరం నా కన్నా గాయత్రికే ఉంది కాబట్టి

కానీ చని పోయిన వాడు మీ కొడుకు

(ఇంకా ఉంది)

సావిత్రీ! మరొక్క వరంబుకోరుకో!
అదియునూ
నీ పతి ప్రాణంబు తప్ప!

నేషనల్ సేవింగ్స్
సర్టిఫికెట్లని
ప్రసాదించండి స్వామీ!

అవును మరి 6 సం"ల నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లు ప్రాణంతో సమానమైనవి.

అందులో అటు వడ్డీకి వడ్డీ ఇటు పన్ను మినహాయింపులు పెద్ద ఎత్తున లభిస్తాయి మీరు ఆదాయపు పన్ను కట్టే వారైతే సుమారు 2 రు ల వడ్డీ లభిస్తుంది అంటే 25 శాతం వరకు వడ్డీ పొందవచ్చు ఆదాయపు పన్ను కట్టేవారు కాకపోయినా మీకు రుపాయిన్నర వడ్డీ లభిస్తుంది అంటే సుమారు 18 శాతం వడ్డీ అన్న మాట ఇంకా ఎన్ని లాభాలు ఉన్నాయో మీకు తెలుసా!

1) ఉమ్మడిగా కాని మీ పిల్లల పేరుతో కాని కొనుక్కోవచ్చును కొన్న తరువాత ఎవరి పేరునైనా సరే మార్చుకోవచ్చును
2) ఈ సర్టిఫికెట్లను దేశంలో ఎక్కడైనా ఏ పోస్టాఫీసులోనైనా మార్చుకోవచ్చును
3) తాకట్టు నామినేషన్ సదుపాయాలున్నాయి
4) మీ సొమ్ముకు ప్రభుత్వ బద్రత
5) రు లు 10 50 100 500 1000 5000 మరియు 10 000 మూల్యాలలో దొరుకుతాయి

CANON ADS

మిగతా వివరాలకు మీ దగ్గరలోని పోస్టాఫీసులోగాని కలెక్టరేట్‌లోని తహసిల్దారునుగాని భారతప్రభుత్వ జిల్లా పొదుపు కార్యాలయంలోగాని రీజనల్ డిప్యూటీ డైరెక్టర్ (స్మాల్ సేవింగ్స్) ను గాని నేషనల్ సేవింగ్స్ ఏజెంట్‌ను గాని సంప్రదించండి





**జాతీయ పొదుపు సంస్థ**

మీ భద్రతే మా లక్ష్యం



కమీషనర్, స్మాల్‌సేవింగ్స్,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం,
హిమాయత్ నగర్, హైదరాబాదు 500 029

# యోగభూమి గంగోత్రి

హృషికేశ్‌కు 248 క మి దూరంలో హిమశిఖరాల మద్య గంగోత్రి పుణ్యక్షేత్రం ఉంది భగిరథుడు ఇక్కడ 5500 సంవత్సరములు తపమాచరించగా దేవగంగ భువికి దిగినదని స్థలపురాణ కథనం గంగామతల్లి మందిరం ప్రక్కనే ఆనాడు భగిరథుడు కూర్చుని తపస్సు చేసిన భగిరథ శిల ఉంది తర్వాత కాలములో కురుక్షేత్ర మహాసంగ్రామానంతరము పాపపరిహారార్థము పాండవులు యికడ దేవయజ్ఞము జరిపినట్లు చెపుతారు యోగులకు మహర్షులకు గంగోత్ర నిలయమై ఉన్నది 18వ శతాబ్ది ప్రారంభంలో గూర్ఖా కమాండరైన అమర్‌సింగ్ థాపా యిక్కడ మందిరం నిర్మించాడు అక్షయ తృతయ (ఏప్రల్ మే) పర్వదినమున తెరిచిన మందిరం తిరిగి దిపావళి రోజున మూస్తారు గంగోత్ర వరకు బస్సు సౌకర్యము కలదు

## ప్రాశస్త్యం

గంగోత్రలోని జలము అతిపవిత్రమైనది నిర్మలమైనది కనుకనే అనేక సంవత్సరములు నిలువ ఉంచినప్పటికి చెడిపోదు భక్తులు ఇక్కడి పవిత్రోదకమును రామేశ్వరము తెచ్చి శివాభిషేకం చేస్తుంటారు 6 నుండి 8 క మి వెడల్పుతో 20 క మి పొడవున గోముఖ్ వరకు గంగోత్రి వ్యాపించి ఉంటుంది అనేక పర్వతశిలల మద్యగ దరణి హృదయం నుండి పెల్లుబికే మంచునీరు కనులపండువుగ ఉంటుంది భూమిపైగల సమస్త జీవులను రక్షించుటకు గంగామాత దిమిద్ధిమి ధ్వనులతో పరుగిడుతున్నదా అనిపిస్తుంది

నిర్గతేప నగేభ్యశ్చ
దరణీ హృదయాత్తథా!
మాతేవ వత్సలాభాతి
గంగోత్రి కరుణాన్వితా!!

సూర్యకాంతి ఆ ప్రవాహములో వివిద రంగులతో వివిద దిశలలో పరివర్తనము చెందినప్పుడు ఆ పవిత్ర రజత ప్రవాహములో నీలకాంతమణులు పొదిగారా అన్నట్లు మనోహర దృశ్యం సరళహృదయులలో సరసభావాలను దీప్తపరుస్తుంది

## గోముఖ్

గంగోత్రి నుండి తూర్పుగ 20 క మి కాలినడకన వివిద ప్రయాసలకోర్చి యాత్రికులు గోముఖ్ చేరి అక్కడ మంచునీట ప్రవాహంలో స్నానం చేస్తారు గోముఖ్ తీర్థంలో చేసిన స్నానం సర్వ పాపములను హరించి సమస్త దోషశమనం కలిగిస్తుందని ఆర్య భావన సర్వలోకైక పావని అయిన గంగలో పితృదేవతలకు పిండ ప్రదానం చేస్తే ఆ పితృదేవతలు సంతరిస్తారని ఆర్ష సంప్రదాయం ఉద్ఘోషిస్తున్నది -

నరాణాం సర్వ పాపఘ్ని
పితృసంతారణో చితా!
విష్ణోర్వామ పదోద్భూతా
సర్వలోకైక పావన!!

మేరు సుమేరు

గోముఖ్ నుండి మూడు కిలో మీటర్లు వెళితే మేరుపర్వతము దవళ కాంతులీనుచు దర్శనమిస్తుంది దీని నానుకొని అనేక యోగులకు నిలయమైన తపోవనం ఉంది దానికి ఎదురుగ మహర్షులకు ఆనందకరమై సర్వదేవతల విహార భూమియైన నందనవనము ఉంది అక్కడకు అనతి దూరంలోనే సుమేరు పర్వతం ఉంది ప్రపంచంలో మరెక్కడా లభ్యంకాని ఓషదులు అక్కడ లభిస్తాయి

మహాకవి కాళిదాసు కుమార సంభవము లో హిమవత్పర్వతాన్ని దూడగ మేరువును ఎతికేవానిగ భూమిని గోవుగ భావించిసహృదయులకు రససిద్ధి కలిగిస్తాడు-

యం సర్వశైలాః పరికల్ప్య వత్సం
మేరౌస్థితే దోగ్ధరి దోహదక్షే
భాస్వంతి రత్నాని మహౌషధీశ్చ
పృథూపదిష్టాం దుదుహుర్ధరిత్రీం!!

యోగులు మేరు దండమును మేరువు అంటారు దానికి ఆదారమైన 'మూలాదార చక్రాన్ని సుమేరువు అంటారు మూలాదారంలోని జీవుడు యోగసాదన ద్వార షట్చక్ర భేదనం చేసుకుంటూ ఆనందమయమైన సహస్రార కమలం చేరుతాడు అదే నందనవనము అక్కడే అమృతవాహిని గంగ ఉద్భవిస్తుంది ప్రకృతి జీవతత్త్వాలను యింత సుహృత్తరంగ భావించగలిగిన ఘనత విశ్వసాహిత్యంలో భారతీయులకే దక్కింది

## ఇతర దర్శనీయ తీర్థాలు

హృషికేశ్ నుండి దరసు వరకు యమునోత్రి, గంగోత్రిలకు ఒకే మార్గాన వెళ్లాలి అక్కడ నుండి 28 క మి వెళితే ఉత్తరకాశి వస్తుంది అక్కడ విశ్వనాధుని మందిరము కాళికాదేవి మందిరము ప్రశస్తమైనవి మకరసంక్రాంతి సందర్భముగ ఉత్తరకాశిలో వారం రోజులు ఘనంగ ఉత్సవాలు చేస్తారు నెహ్రూ పర్వతారోహణ శిక్షణ కళాశాలను చూడవచ్చును ఆ తర్వాత వరుసగ గంగోరి మనేరి భట్వారి గంగానాని సుఖీ ఝాలా హర్‌సిల్ లంకాచట్టి, భైరన్‌ఘాటి మున్నగు దివ్యక్షేత్రములు రమణీయ దృశ్యములతో పాటు ఆద్యాత్మిక తత్త్వమును వెదజల్లుతుంటయి భైరన్‌ఘూటిలో భాగిరథి జాహ్నవిల అందాల సంగమం దర్శించవలసినదే! గంగోత్రి నుండి అగ్నేయంగ 18 కి మీ నడిస్తే కేదార సరోవరం వస్తుంది అక్కడ

గంగోత్రి



నుండి కేదారనాథ్ చాల దగ్గర కాని మార్గం చాల దుర్గమంగ ఉంటుంది

## వసతి-సౌకర్యాలు

గంగోత్రిలో యాత్రికుల సౌకర్యార్థం వసతిగృహం ఆటవీశాఖవారి వసతిగృహం రహదారుల శాఖవారి విశ్రాంతి గృహము లాగ్ క్యాబిన్ ఉన్నయి

యమునోత్రి గంగోత్రి కేదారనాథ్ బదరినాథ్ యాత్రలన్నింటికి ఆంధ్ర ప్రాంతమువారికి రైలుప్రయాణముతో కలిపి 15 నుండి 20 రోజులు పడుతుంది వెయ్యి నుండి పదిహేను వందల రూపాయిల వరకు ఖర్చవుతుంది మార్గంలో రామ్‌టెక్ మదుర బృందావనం ఆగ్రా ఢిల్లీ మున్నగు ప్రాంతములు కూడ చూడవచ్చును

టూరిస్టు బస్సులలో ప్రయాణం హడావిడిగ ఉంటుంది అలాకాకుండా 6 నుండి పదిమంది వరకు జట్టుగా ఏర్పడి వెళితే సౌకర్యంగ వెళ్ళి అన్ని ప్రాంతాలు తృప్తిగ దర్శించుకొనవచ్చును అన్ని మజిలీలలో చాల పరిశుభ్రంగ ఉండే సత్రములు ఉచితంగ లభిస్తాయి పూటకు మూడు రూపాయిలకే భోజనం లభిస్తుంది ఎక్కడా మోసాలు జరగవు

గంగోత్రి యాత్ర మోక్షార్పత చేకూరుస్తుందని ఆర్ష భావన

— కెప్టెన్ షేక్ మౌలాలీ



గంగోత్రి మందిరము

# వ్యక్తిగతం



డాక్టర్ బిమల్ చంద్ర ఘోష్ అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్షుడు రొనాల్డ్ రీగన్‌కి చికిత్స చేసే భారతీయ డాక్టరు ఆ మధ్య రీగన్‌కి శస్త్ర చికిత్స చేసిన వైద్య బృందంలో డా బిమల్‌ఘోష్ కూడా ఉన్నారు ఈయన కొత్త ఢిల్లీలోని మౌలానా ఆజాద్ కళాశాలలో శస్త్ర చికిత్సకి సంబంధించిన శిక్షణని పొందారు. అనంతరం అమెరికా సంయుక్త రాష్ట్రాలకి వెళ్ళి న్యూయార్క్‌లోని స్లోన్ కెట్టరింగ్ కాన్సర్ సెంటర్‌లో 1969 నించి 1972 వరకూ కాన్సర్‌కి సంబంధించిన శస్త్ర చికిత్సని అధ్యయనం చేసారు అమెరికా అధ్యక్షుడి వైద్య నిమిత్తం రూపొందించబడిన డాక్టర్ల బృందంలో డా బిమల్ ఒక్కరే భారతీయుడు 1981లో ఈయన అమెరికా పౌరసత్వాన్ని స్వీకరించారు □



ఎం డి మార్కుల కుంభకోణం కేసులో బొంబాయి హైకోర్టు తీర్పు దృష్ట్యా మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ శివాజీరావ్‌పాటిల్ నీలంగేకర్ మార్చి 7న తమ పదవికి రాజీనామా చేసారు ఈ వ్యవహారంలో ముఖ్యమంత్రి ఆయన కుమార్తె డాక్టర్ శ్రీమతి చంద్రకళాదవళే ఆదేశంపై ఆమెకి అనుకూలంగా ఎం డి పరీక్షా ఫలితాలలో అక్రమాలు జరిగాయని న్యాయమూర్తి పేర్కొన్నారు తీర్పు వెలువడిన 24 గంటలలో గా శ్రీ నీలంగేకర్ తమ రాజీనామా గవర్నర్‌కి సమర్పించారు శ్రీ వసంత్ దాదాపాటిల్ స్థానంలో ముఖ్యమంత్రి అయిన ఈయన ఆ పదవిలో తొమ్మిది నెలలే ఉన్నారు □



స్వీడన్ ప్రధానమంత్రి ఒలాఫ్ పాల్మె(59)ని ఫిబ్రవరి 28 రాత్రి స్టాక్‌హోమ్‌లో ఎవరో కాల్చి చంపారు ఈయన తమ సతీమణితో కలసి వెళ్ళి సినిమా చూసి తిరిగి నడచి వస్తూ వుండగా ఈ దారుణం జరిగింది శ్రీ పాల్మె 1963 నించి వివిధ మంత్రిత్వ శాఖలు నిర్వహించి మొదటిసారిగా తమ 41వ ఏట 1969లో ప్రధానమంత్రి అయినారు 1976వరకూ ఆ పదవిలో ఉన్నారు • అనంతరం 1982లో ఆయన తిరిగి ప్రధానమంత్రి పదవి చేపట్టారు ఈయన అభిజాత్య కుటుంబానికి చెందినవారే అయినా చిన్నతనం నించి సోషలిస్టుగానే ఉండేవారు వియత్నాంలో అమెరికా సంయుక్త రాష్ట్రాలు అనుసరించిన విధానాల పట్ల ఆయన ఆ దేశానికి వ్యతిరేకంగా మారారు శాంతి స్నేహ సహకారాలు నిరాయుధీకరణ సమానత్వం కోసం కృషి చేశారు □

# వారఫలం

## 28-3-1986 శుక్రవారం మొదలు 3-4-1986 గురువారం వరకు

★ **మేషం** ఈ వారం ఏమైనా మేలు జరుగుతుందా? ఏ రంగాన అయినా ప్రకాశవంతంగా ఉంటుందా? ఏమో ఎలా జరుగుతుందో? వ్యాపారమెలాగో అని బెంగపడనవసరం లేదు అంతా సుముఖమే ఆనందదాయకమే స్త్రీలకు సుఖశాంతులు అధికారమందు పెంపు

★ **వృషభం** మీ మాట విలువ పెరుగుతుంది నలుగురిలో పేరు ప్రతిష్టల కవకాశమున్నది సభా గౌరవానికి కొరతలేదు పోయిన చోటనెల్ల మెప్పు పొందగలరు అంతస్థు అభివృద్ధినంది, వారమంతా ఆనందదాయకమే స్త్రీలకు సర్వానుకూలత, కించిత్తు ధనలబ్ధి

★ **మిధునం** నూతన వృత్తి నవలంబించుట కొందరి విషయంలో చెప్పవచ్చు స్థిరాస్థి అభివృద్ధికి అవకాశమున్నది రాజకీయంగా చికాకునకు అవకాశముంటుంది లేనిపోని వ్యవహారాలు తల దిమ్మెతిస్తాయి అంటే గ్రహానుకూలత తక్కువ అని అర్థం స్త్రీలకు వృత్తియందు కొంత లోపం చెప్పదగిన సమయం

★ **కర్కాటకం** ఉద్యోగరీత్యా ప్రకాశముంటుంది ప్రభుత్వపరంగా అందవలసిన పైకం అందటానికి ఆక్షేపణలేదు శ్రమించండి దూర బంధువులో మిత్రులో దరిదాపులకు రాగలరు శ్రమించి ఒకానొక వ్యవహారమందు అనుకూలత సాధించుటకు అనువైన దినాలే స్త్రీలకు శుభప్రస్తావనలు, వృత్తియందనుకూలం

★ **సింహం** ఇంట చిన్నవారుంటే బాగా జాగరూకత వైగొనవలసిన అగత్యమున్నది ఆరోగ్యరీత్యా తగినంత జాగ్రత్త వైకొనవలె విదేశాల నుండి కావలసినవారు యింటికి రావటం, శుభకార్య ప్రస్తావనలుండటం గమనించగలరు స్త్రీలకు ఆస్తి అంతస్థుల వ్యవహారాలందు పట్టింపులు

★ **కన్య** శ్రమకొలది ఫలితం దక్కింది అని వారాంతాన సంతోషపడతారు వ్యాపార వ్యవహారాలందు తగు జాగ్రత్త కావలసి యున్నది రాజకీయంగా యత్నాలు ఏ విధంగా కలసి రాలేదని గ్రహింపగలుగుతారు పిత్రార్జిత సంబంధంగా ఏవో కలతలు రేగుటకు ఆస్కారం ఉంటుంది హుషారుగా ఉండవలసిన కాలం స్త్రీలకు ఆప్తులవలననో మిత్రుల వలననో మేలు చేకూరుతుంది గ్రహించాలి

★ **తుల** లేనిపోని వ్యవహారాల జోలికి పోరాదు ఆడిన మాట తప్పినారనే అపప్రదకు లోనుగారాదు చేసిన వాగ్దానాలు చెల్లింపవలసిన సమయం అంతేగాక చెల్లింపవలసిన డబ్బును గూర్చిన వత్తిడి రానున్నది స్త్రీలకు కళాసాహితీ మార్గాన కొంత మేలుంటుంది

★ **వృశ్చికం** ఇప్పుడిప్పుడే రాశి వర్గాన కలిగే మార్పులు మీకు ధనప్రదాయకాలు ఆనందదాయకాలు ఇంతవరకూ వ్యవహరించే రంగమే తప్ప నూతన రంగాన అభివృద్ధి ఆశించుటకు వీలులేదు మబ్బు విడిచిన సూర్యునిలాగ ప్రకాశింపగల సమయం అయినా ఆరోగ్య లోపం చెప్పక తప్పదు స్త్రీలకు మానసిక వికాసం, వృత్తియందు వృద్ధి

★ **ధనుస్సు** క్రమ క్రమంగా స్థితియందు అభివృద్ధి కలుగుటకు ఆక్షేపణ లేదు నూతన వ్యక్తుల పరిచయం ఏర్పడుతుంది వ్యాపారరీత్యా మంచి ఫలితాలే పొందగలుగుతారు ఇంట శుభం జరిగే ప్రసక్తి లేకపోలేదు స్త్రీలకు చిక్కినట్లు చిక్కి కళాసాహితీరంగాన అవకాశాలు మాయమవుతాయి రాజకీయంగా మేలే

★ **మకరం** వృత్తియందు క్రమానుగతమైన మేలు చేకూరుతుంది ఎంతో కాలాన్నుండి వేచివున్న ఉద్యోగంలో అనుకూల వార్త వింటారు వృత్తినిగాని స్థిరచరాస్తులుగాని పెంపుజేసికొనుటకు అనుకూల వాతావరణం ఏర్పడుతుంది బంధువుల నుండియో మిత్రుల నుండియో శుభ వర్తమానం అందనున్నది స్త్రీలకు అధిక వ్యయం నూతన వస్తు సేకరణ

★ **కుంభం** చాలాకాలంగా ఏదో వ్యవహారం వేధిస్తున్నదిగా! కోర్టు వ్యవహారాలు తికమకపెడుతున్నాయిగా! ఇక ధైర్యంగా ముందుకు సాగిపోవటానికి సర్వవిధాలా అవకాశమేర్పడింది రాజకీయంగా ఎలాంటి మేలు ఆశింపరాదు ముందుకు సాగితే ఆశాభంగం తప్పదు స్త్రీలకు ప్రయాణానుకూలం

★ **మీనం.** ఒకటి ఆలోచించి మరొకటి పూర్తిచేయాలని సంకల్పం ఏది అందుబాటుకు రాదు కలసి రాలేదేమి? అని గ్రహిస్తారు అప్పు తీసికొన్నవారు తిరిగి చూడరేమి? అని ఆందోళనపడుతారు అధిక వ్యయం సూచించే వారం గమనించండి స్త్రీలకు గృహ సంబంధంగా చికాకు ద్రవ్యాభావం చెప్పదగిన ముఖ్యాంశాలు

-విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి




"జన. సదాలాల నన్న మమ బవతు
లోకో దుర్గాణి తరతు బద్రాణి పశ్యతు

గంబీ రమైన విగ్రహంతో నుదుట విబూదితో సాక్షాత్తు పరమేశ్వర స్వరూపంలా వున్న పరమేశ్వరశాస్త్రి నోట నుండి గంబిరంగా వెలువడుతున్నాయి- ఆ మాటలు

పడక కుర్చీలో కూచొని కళ్ళు మూసుకుని గంబీరంగా వుచ్చరించి నెమ్మదిగా కళ్ళు తెరిచి చేతిలోని బగవద్గిత ను కళ్ళకు అద్దుకొని పేజిలు తెరిచాడు

ఎంతో ఆనందంగా వుల్లాసంగా- చేతిలో పత్రికతో వచ్చిన రామారావు ఆయన చేష్టలు చూస్తూ అడుగు ముందుకు వేయలేక గుమ్మం దగ్గర అట్లాగే నిలబడిపోయాడు

కొద్ది సమయం గడిచాక

యదాలాపంగా అటు చూసిన పరమేశ్వరశాస్త్రి కంట పడ్డాడు రామారావు

రావయ్యా! అక్కడే నిలబడ్డావు ఆప్యాయంగా పిలిచాడు

రామారావును చూస్తె పరమేశ్వరశాస్త్రికి ఆప్యాయత

పరమేశ్వరశాస్త్రిగారంటె రామారావుకి గౌరవం బక్తి

హైస్కూలు మాస్టారుగా రిటైర్ అయ్యారు పరమేశ్వరశాస్త్రి సంస్కృతంలో మంచి దిట్ట వయసు పైబడినా ఒంక పెద్దగా లేకపోయినా ఎప్పుడూ చదువుతూనో రాస్తూనో వుంటారు తప్ప ఖాళిగా కూర్చోరు

రామారావు యువకుడు సాహిత్యాభిమాని అడపాదడపా కథలు కవితలు వ్రాస్తూ వుంటాడు పరమేశ్వరశాస్త్రి సాన్నిహిత్యం చిత్రంగా దొరికంది రామారావుకి పరమేశ్వరశాస్త్రికి శిష్యులని చెప్పుకోదగిన వారు ఎవ్వరూ లేరు అసలు ఆయన దగ్గరకు రానివ్వడు ఇప్పటి యువతకు కొడాలి ఎవరో విశ్వనాథ ఎవరో కూడా తెలీదు అని ఆయన అబిప్రాయం అందుకే ఆయన వద ఎవ్వరూ నిలువలేదు ఒకరిద్దరు నిలచినా వాళ్ళ పాండిత్యాన్ని వాళ్ళ చేతనే చెప్పించి తరిమివేసేవాడు

ఒకసారి రామారావు కూడా వెళ్లేడు సంస్కృతం నేర్చుకోవలసిన అగత్యం ఏర్పడి రామారావు ఎం ఎ ప్రైవేటుగా కట్టాడు సంస్కృతం చక్కగా చెప్పేవాళ్ళు ఎక్కడ వున్నారు? చివరకు ఎవరో యిచ్చిన సలహానుసరించి శాస్త్రిగారి వద్దకు వెళ్లాడు

రామారావుకు సాహిత్యం కరతలామలకము' కాకపోయినా-

కృష్ణశాస్త్రి ఎవరో రాయప్రోలు ఎవరో తెలుసు

బుచ్చిబాబు ఎవరో గోపిచంద్ ఎవరో తెలుసు తెలియని విషయాలు తెలుసుకోవాలనే ధ్యాస' ఉండేది అదిగాక మనిషి నమ్రతగా వుండేవాడు

'పర్వాలేదు అనుకున్నాడు శాస్త్రి

అదిగాక దగ్గర ఇల్లు'

చిన్న చిన్న పనులు కూడ చేసి పెట్టేవాడు రామారావు అట్లా శాస్త్రిగారితో దగ్గరయ్యాడు రామారావు శాస్త్రిగారంటే రామారావుకి బక్తి గౌరవం నిండుగా వున్నాయి- కాని సాహితపరంగా ఆయన అబిప్రాయాలకు అంత విలువ ఇచ్చేవాడు కాదు చాందస బావాలు శాస్త్రిగారిలో నిండుగా వున్నాయని రామారావు అబిప్రాయం

లోకమంతా అభ్యుదయ బావాలతో రయ్ న దూసుకుపోతున్న ఈ రోజుల్లో కూడా నన్నయ అని, పాల్కురికి అని- శాస్త్రిగారు అనటం రామారావుకి అంతగా నచ్చదు శాస్త్రిగారు సంస్కృతాంధ్రములను వుగ్గబట్టేశాడుగాని స్వయముగా వ్రాసి ఎఱగడని రామారావు సమాదానపరుచుకునేవాడు

ఒకసారి శాస్త్రిగారు అన్నారు

నీవు కథలు రాస్తావుట వకసారి చూపించు

రామారావు సిగ్గుపడ్డాడు

శాస్త్రిగారి నోట నుండి ఆ మాట రావటంతో పొంగిపోయాడు అప్పటివరకు తను రాసిన కథలన్నీ చూపించాలనే అతని కోరిక ఏమంటారో! అనే బయంతో వుండిపోయాడు

ఈమద్యనే ఒక కథ పచ్చింది ఆ పత్రిక ఎడిటర్ స్వయంగా అబినందిస్తూ- మరేమైనా కథలు వుంటే పంపించమని రామారావుకు తెలియజేశాడు

తన మిద తనకు నమ్మకం ఏర్పడింది-రామారావుకి

ఆ పత్రికే చేతబట్టి శాస్త్రిగారి వద్దకు వచ్చాడు

శాస్త్రిగారికి ఎదురుగా చాప మిద కూర్చొని తన కథ వున్న పత్రిక యిచ్చాడు

కథా అన్నారు శాస్త్రిగారు- భగవద్గీత ప్రశ్నన పెడుతూ

అవును

పేజిలు త్రిప్పి రామారావు కథ చూశారు శాస్త్రి

బొమ్మ బావుంది చిన్న అక్షరాలు చూపు చాలటం లేదు చదువుతావూ? అన్నారు

రామారావు కథ చదువుతూ వున్నాడు తను వ్రాసిన కథ తనే చదవటం- విచిత్రమైన అనుభూతిని కలిగిస్తోంది

శాస్త్రిగారు మౌనంగా వింటూ వుండిపోయారు

సాంతం చదివి శాస్త్రిగారి కళ్ళలోకి చూశాడు రామారావు

ఆయన ముఖంలో అంత సంతృప్తి లేదు

'పర్వాలేదు మొక్కుబడిగా అన్నట్లు వుంది

రామారావు మనసు చివుక్కుమంది

ఈ ఛాందస భావాలు విడనాడితేగాని పెద్దలు బాగుపడరు నన్నయ తిక్కనలను వొదిలి కృష్ణశాస్త్రి శ్రీశ్రీలను చదివితే గాని నేటి సాహితి విలువలు తెలియవు గడిచిపోయినదాన్ని పట్టుకుని వూగులాడే కంటె నవ్య సాహిత్యంతో కలిసి అడుగులు వేస్తేగాని సాహితీ మాధుర్యం తెలియదు

గ్రంథాలు పఠించటం కాదు

ఒక్క ముక్క వ్రాయమను తెలుస్తుంది-

పురిటి నొప్పులు గొడ్రాలికేమి తెలుస్తుంది అనుకున్నాడు రామారావు

మంచి పుస్తకాలు చదవాలి గ్రహించుకోవాలి అప్పుడు ఇంకా బాగా వ్రాస్తావు అన్నారు శాస్త్రి

రామాయణ భారతాలు అర్థంగాని పద్యాలు చదవాలి కాబోలు- అని నవ్వుకుని బాగా తల వూపి ఉక్రోషంగా వొచ్చేశాడు రామారావు

తనంటే ఏమిటో శాస్త్రిగారికి తెలియజేయాలనుకున్నాడు

తనలోని కవిని రచయితని రెండుగా వేరుపరచాడు

ఒక కంట కవితలు

# గితోపదేశం

మరో కంట కథలు

కలాన్ని కత్తిలా ఝుళిపించాడు

ప్రతి పత్రికలోనూ రామారావు రచనలు చోటుచేసుకున్నాయి కొన్ని పత్రికలలో సీరియల్ గా నవలలు రావటం మొదలు పెట్టాయి పాఠకలోకంలో గుర్తింపు లభించింది

రామారావు కథల కోసం అర్రులు చాచకపోయినా-గుర్తింపు మాత్రం వొచ్చింది పత్రికలకు సుపరిచితుడైపోయాడు రోజూ ఏదో ఒకటి రాస్తేగాని నిద్ర పోలేని స్థితికి వొచ్చేశాడు ఒక్కోసారి విసుగు కూడ కలిగేది

కాని శాస్త్రిగారి రూపం కళ్ళలో కనిపించి వెక్కిరించినట్లుగా తోచేది శాస్త్రిగారి చేత కూడ శెబాష్ అనిపించుకోవాలి- అదే రామారావు యత్నం అందుకే ఇంత కృషి ఆ సమయంలోనే రామారావు కథలు బహుమతులను కూడ గెలుచుకున్నాయి ఇప్పుడు వచ్చినట్లు శాస్త్రిగారు అంగీకరిస్తారని అనుకున్నాడు పాఠకుల దగ్గర నుండి ఉత్తరాలు రావటం చూచి రామారావు కళ్ళు ఆనందంతో మెరిశాయి

శాస్త్రిగారి ఇంట్లో- శాస్త్రిగారి కుమారుడు అఖరుకి మనుమడు కూడ రామారావు కథలంటే ఇష్టం చూపించసాగారు

రామారావు కథల్లోని గొప్పతనం తాతతో చెప్పేవాడు మనుమడు

శాస్త్రిగారు చిరు నవ్వుతో వింటూ వుండేవారు

రామారావు బొత్తిగా శాస్త్రిగారికి కనిపించటం లేదు

రచనా సాగరంలో కొట్టుమిట్టాడుతూ తీరిక లేకుండా వుండిపోయాడు- రామారావు

ఇప్పుడు అతనికొక ప్రత్యేకత ఏర్పడింది శాస్త్రిగారు తన ఔన్నత్యాన్ని ఒప్పుకుంటే సరి లేకుంటే ఆయన తెలియనితనం బయట పడుతుంది అనుకున్నాడు రామారావు

రామారావు ఎంత బిజగా వున్నా శాస్త్రిగారిని గురించి మాత్రం ఎప్పుడూ ఆలోచిస్తూనే వుండేవాడు ఒకసారి తరిగ్గా వెళ్ళి శాస్త్రిగారితో చర్చించాలని ఆయన చేతనే ' ఆయన అభిప్రాయాలు పాతబడిపోయినవని తన లాంటి అభ్యుదయ భావాలుగల రచయితలే సమాజానికి కావాలని చెప్పించుకోవాలి

అప్పుడే నిజమైన తృప్తి

అందుకే రామారావు తాపత్రయం

ఒకసారి శాస్త్రిగారి మనుమడు కనిపించాడు

తాతగారు బావున్నారా'

బావున్నారు మీరు రావటం లేదు తాతగారు అడుగుతున్నారు

తప్పకుండా వొస్తాను

నాన్నగారు కూడా మీరు కనిపించటం లేదంటున్నారు మరచిపోకండి అంటూ వెళ్ళిపోయాడు ఆ కుర్రాడు

మాట్లాడుతున్నప్పుడు ఆ కుర్రాడి కళ్ళలోని వెలుగుని పూర్వం లేని వినయాన్ని గ్రహించాడు రామారావు

చిన్నగా నవ్వుకున్నాడు ఇదంతా తన రచనల ప్రభావమే' శాస్త్రిగారు అంతగా కలవరిస్తున్నారంటే రామారావుకి చాల ఇష్టం కలిగింది ఈనాటికి తనను గుర్తించారన్నమాట

ఒక సాయంత్రం తరికి చేసుకుని శాస్త్రిగారి వద్దకు వెళ్లాడు రామారావు

సూర్యుడి వేడిలోని వెచ్చదనం తగ్గి పల్చని బంగారు కిరణాలు లోకమంతా పరుచు కుంటున్నాయి దక్షిణపు గాలి శరీరాన్ని తాకుతూ ఆహ్లాదాన్ని కలిగిస్తోంది

నందివర్ధనం చెట్టు క్రింద వాలు కుర్చీలో పడుకుని ఏదో పుస్తకం ముఖానికి దగ్గరగా పెట్టుకుని చూస్తున్నారు శాస్త్రిగారు

శాస్త్రిగారిని చూడగానే రామారావు ఠక్కున ఆగిపోయాడు చూడదగ్గ విగ్రహంతో ఏదో తెలీని తేజస్సుతో- నిర్మలంగా నిశ్చలంగా వున్న శాస్త్రిగారిని చూస్తే రామారావులో తెలీని భయం గౌరవం చోటు చేసుకుంటాయి

ఈసారి మాత్రం మనసు ఆదినంలో పెట్టు కున్నాడు తను పాత రామారావు కాదు గొప్ప రచయిత రామారావు శాస్త్రిగారితో దీర్ఘంగా చర్చించాలి- అనుకున్నాడు

నమస్కారం' మాస్టారూ

కళ్లెత్తి చూసిన శాస్త్రిగారి వదనం వికసించింది

రా' ఇట్లా కూచో అని దగ్గరగా వున్న కుర్చీ చూపించారు

మౌనంగా కూర్చున్నాడు రామారావు

' బావున్నావా? అసలు కనిపించటం లేదు ఏం చేస్తున్నావ్

చురుక్కుమంది రామారావు మనసు

ఇంతలో మాస్టారుగారి కుమారుడు ఎప్పుడూ లేనిది ఆప్యాయంగా పలకరించి, కాఫీ






**నారాయణ నేసిన**
**పోచంపల్లి చీరలకు**
**ఎవరూ వంక పెట్టలేరు.**
**కాని పెట్టుబడిలేక**
**అతను మగ్గాలను మూలపెట్టి**
**కూలీపనిచేసేవాడు**

# యిప్పుడు నారాయణ మగ్గాల మీద నేసిన చీరలు రాష్ట్రమంతటా అమ్ముడు పోతున్నాయి

నారాయణ ముత్తాతలు పేరెన్నిక గన్న పద్మశాలీలు అవకాశం వస్తే నారాయణ వారితో సరితూగగలడు ఆ అవకాశం అతనికి ఆంధ్రప్రదేశ్ కోఆపరేటివ్ బ్యాంకు కల్పించింది

ఆ రోజు నుంచి నారాయణ వెనుతిరిగి చూడలేదు సహకార బ్యాంకింగు వ్యవస్థ గ్రామీణ అభివృద్ధికి సత్వర సహాయం సక్రమంగా అందించేందుకు ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడింది

ఈ వ్యవస్థ మూడు దశలుగా విభజింపబడింది మూలసంస్థ ఆంధ్రప్రదేశ్ స్టేట్ కోఆపరేటివ్ బ్యాంకు 'ఆప్‌కాబ్ అధ్వర్యం క్రింద 27 జిల్లా కేంద్ర సహకార బ్యాంకులు 430 శాఖలతో ఉన్నాయి ఈ సంస్థలకనుబంధమైన 6729 ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాల (PACS) పరిధిలో ఆంధ్రప్రదేశ్‌లోని గ్రామాలన్నీ ఉన్నాయి

PACS లో చేరిన వారికి కేవలం సహకార బ్యాంకింగు వారి సహాయాలన్నీ లభించడమే కాకుండా వారు ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాల వాటాదార్లు కూడా అవుతారు

**ఆం. ప్ర. సహకార బ్యాంకింగ్ విధానము కుటీర పరిశ్రమలు సక్రమంగా నడవడానికి ముఖ్యకారకులు**



ఆంధ్రప్రదేశ్‌లో గ్రామీణాభివృద్ధికిగాను యిచ్చే ఋణాలలో ఆప్‌కాబ్‌దే అగ్రస్థానం మొత్తం ఋణాల పంపిణీలో 30/ ఆప్‌కాబ్ వారిదే

వ్యవసాయాభివృద్ధికి ఎక్కువ ప్రాముఖ్యం యిచ్చినా కూడా కుటీర పరిశ్రమలు చిన్న తరహా పరిశ్రమలు పశువుల పెంపకాలు కోళ్ళఫారాలు మొదలగువాటికి కూడా సహాయం అందిస్తారు అసలుకి వచ్చిన ఆదాయాన్నంతా తిరిగి ఆంధ్రప్రదేశ్‌లోని గ్రామాల అభివృద్ధి కొరకు మాత్రమే వెచ్చించే ఏకైక ఆర్థిక సంస్థ ఆప్‌కాబ్ ఒక్కటే

ఆప్‌కాబ్ రిజర్వుబ్యాంకు వారి అత్యంత నిర్దిష్టమైన నిబంధనలతో అతి సమర్థవంతంగా నిర్వహించబడుతుంది మిగతా వాణిజ్య సంస్థలు యిచ్చే సహాయాలన్నీ యివ్వటమే కాకుండా – మీ జమలన్నిటిమీద 1/4/ ఎక్కువ వడ్డీని కూడా చెల్లిస్తారు దీనిని రెట్టింపు చేసి జిల్లా కేంద్ర సహకార బ్యాంకు 1/2/ ఎక్కువ వడ్డీ చెల్లిస్తారు

ఈ రోజు ఆంధ్రప్రదేశ్‌లోని వందలాదిమంది నారాయణలాంటి వారు జీవనోపాధి కొరకు ఆప్‌కాబ్ వారికి ఋణపడి వున్నారు

**ఆంధ్ర ప్రదేశ్ సహకార బ్యాంకులు**

**ఆంధ్ర ప్రదేశ్‌లో గ్రామీణ ప్రజలకు శ్రీరామరక్ష**

పట్టుకొచ్చాడు

"మీ కథలు ఎంత బావున్నాయో! ప్రతిదీ వదలకుండా చదువుతున్నాము "

శాస్త్రిగారు వుండటం వల్ల యిబ్బందిగా ఫీలయ్యాడు రామారావు లోలోపల మాత్రం సంతోషంగా వుంది రవంతసేపు మాట్లాడి వెళ్ళిపోయాడు

శాస్త్రిగారు- రామారావు ఇద్దరే మిగిలారు

ఆ రోజు శాస్త్రిగారితో దీర్ఘంగా చర్చించాలని రామారావు అనుకున్నాడు

శాస్త్రిగారు పండితుడు కావచ్చుగాని- సాహితీ పరంగా పూర్తి అవగాహన లేదు కాబట్టి-అందులోని మంచి చెడ్డలు వివరించాలనుకుని- శాస్త్రిగారి వొంక నిదానంగా చూశాడు రామారావు

"మాస్టారూ! నా కథలు విని వుంటారు నిజమైన మీ అభిప్రాయం చెప్పండి అది నా భవిష్యత్తుకు ఎంతో వుపయోగిస్తుంది ' అన్నాడు రామారావు

"నా అభిప్రాయం ఒకటేనయ్యా! వ్రాసింది ఎక్కువ- చదివింది తక్కువ ' అప్యాయంగానే అన్నారు శాస్త్రిగారు

రామారావుకి అవకాశం దొరికింది

"మీరు చెప్పే గ్రంథాల్లో శృంగారం బూతు అర్థంగాని పదాల గజిబిజి తప్ప ఏముంది మాస్టారూ, సాహిత్యం సమాజానికి అద్దం పట్టాలంటారు ఆ దృష్టితోనే నేను కలాన్ని కదలిస్తున్నాను "

శాస్త్రిగారు బోసి నవ్వుతో తల వూపుతూ వుండిపోయారు

"నువ్వు చెప్పింది నిజమే సాహిత్యం చాల గొప్పది లలిత కళల్లో అగ్రగామి అందులో సమాజం ప్రతిఫలించాలి కాని నేను చెప్పేది అది కాదు "

"మీరు పెద్దలు, మీకు చెప్పగలిగేవాణ్ణి కాదు అయినా నా మాట వినండి వ్రాయటం చాల కష్టం మాస్టారూ ఒక రచనను కొద్ది సమయంలో చదివేసి 'బాగోలేదు' ఇంకా చక్కగా వ్రాయాలి'- అని అనటం చాలా సులభం ఒక్క ముక్క వ్రాయగలిగితేగాని ఆ కష్టం అర్థం కాదు నోటితో చెప్పటం కంటె కాగితం మీద వ్రాయటం కష్టం మీరు అర్థం చేసుకోగలరు నమ్రతగానే కళ్ళతిర్పుకున్నాడు రామారావు

రామారావు మాటల్లో అర్థం గ్రహించారు శాస్త్రిగారు

కొంచెం గట్టిగానే నవ్వుతూ, అప్యాయంగా రామారావు వొంక చూసి అన్నారు

"నువ్వు చెప్పింది నిజమే వ్రాయటం చాల కష్టం చక్కగా వ్రాయటం మరీ కష్టం రచనా పరంగా నేను పెద్ద పండితున్ని కాదనే నా నమ్మకం అందుకే ఇంకా చదువుతూనే వున్నాను వయసులో నేనూ ఏదో కొంత వ్రాశాను నా గదిలోకి వెళ్దాం

రామారావుని ఆసరా చేసుకుని పైకిలేచారు శాస్త్రిగారు

మౌనంగా అనుసరించాడు రామారావు

ఆ గది- రామారావు ఎప్పుడూ చూడలేదు మాస్టారు చూపించలేదంటే న్యాయంగా వుంటుంది

## మానవత...!

మనిషి
అర్థం తెలుసా దీనికి
అది తెలిస్తే -
నరనరాన నిండిన స్వార్థంతో
ఎదుటివాడిని ఏమార్చవు
ప్రక్కవాడిని ఆక్రమించవు
క్రింది మనిషిని అణగద్రొక్కవు
నీపైవారిని క్రింద పడెయ్యవు,
పోనీ, మానవత ఎరుగుదువా?
రక్తపిపాసతో రాజ్యం ఏలవు
మాటల పోటుతో గుండె చీల్చవు
భవిష్యత్తును బాంబులతో పూడ్చవు
భూమ్యాకాశాలు ఏకం చెయ్యవు
భూమిమీది వన్యమృగ జనాలు
సముద్రంలోని జీవకోటి
ఆకలితో ఆక్రందించవు
అందుకే-
నిన్ను మనిషి అనిపిలవడానికి
నాకు మానవత అడ్డొస్తున్నది

—ముదిగొండ

## గీతోపదేశం

రెండు పెద్ద బీరువాలనిండా క్రమ పద్ధతిలో పేర్చబడిన పుస్తకాలు- ఎన్నో ఒక ప్రక్కగా దేవుడి విగ్రహం అవి తప్ప ఆ గదిలో మరేమీ లేవు

రామారావు ఆ పుస్తకాలను చూసి దిగ్భ్రాంతి చెందాడు ఎన్ని గ్రంథాలు మరెన్ని కావ్యాలు గుడ్లప్పగించి చూస్తుండిపోయాడు

దేవుడి విగ్రహాల దగ్గర వున్న బీరువా ఆఖరి అరలో నుంచి శాస్త్రిగారు కొన్ని పుస్తకాలు, ఏవో కాగితాలు బయటకు తీశారు

అవి అన్నీ పాత పత్రికలు

వాటిని అందుకున్నాడు రామారావు

ఆ పుస్తకాలు చూస్తున్న రామారావు మనసు ఆనందంతో ఆశ్చర్యంతో, భయంతో నిండిపోయింది

అందుల -

శాస్త్రిగారు ఆ రోజుల్లో నవ యువకుడుగా వున్నప్పుడు- ఆయన చేసిన అష్టావధాన శతావధానములు- ఫోటోలతో సహా ప్రచురించి వున్నాయి శాస్త్రిగారిని పొగుడుతూ వ్రాసిన వ్యాసాలు

రామారావు కలలో కూడ వూహించలేదు పాత చదువుల బలంతో శాస్త్రిగారు కొంత పాండిత్యం సంపాయించుకోగలిగారని అనుకున్నాడే గాని అవధానాలు అనితర సాధ్యంగా చేసిన మహా వ్యక్తి అని ఏ మాత్రం వూహించలేకపోయాడు

మరి కొన్ని పత్రికలలో- శాస్త్రిగారు వ్రాసిన పద్యాలు, కవితలు- ప్రత్యేక రీతిలో కొట్టు వచ్చినట్టు కనిపించాయి శాస్త్రిగారు అంతటితో ఆగిపోలేదు కథలు కూడా వ్రాశారు నిజమైన పాండిత్యంగల వ్యక్తి ఏది వ్రాసినా- ఎంత రమ్యంగా వుంటుందో తెలిసింది రామారావుకి

అవన్నీ దాదాపు పాతికేళ్ళనాటివే మళ్ళీ శాస్త్రిగారు ఎందుకనో వ్రాయలేదు ఆత్రంగా చదువుతున్న రామారావు కళ్ళకు పరమేశ్వరశాస్త్రి 'శాస్త్రిగారి'లా కనిపించటం లేదు రూపమైనా తెలీని మహా కవులందరూ శాస్త్రిగారిలో కనిపిస్తున్నారు

తను ఇంత కాలం నిర్విరామంగా వ్రాసినవన్నీ శాస్త్రిగారి ఒక పేటిలోని 'చిన్న కథ'కు సరి కావని తెలుసుకున్నాడు రామారావు ఆయన రచనల్లో తెలుగు భాష అమృతంలా తొంగి కళ్ళెదుట వున్న ఆ మహనీయుని ఇంత కాలం గుర్తించలేకపోయినందుకు చాల బాధ కలిగింది

పుస్తకాల్లో ఆయన విశ్వరూపం చూశా రామారావు వొళ్ళు పులకరించింది

నీళ్ళు నిండిన కళ్ళతో శాస్త్రిగారి వొంక చూసి- తటాలున ఆయన పాదాలకు నమస్కరించాడు

ఆఖరున శాస్త్రిగారు కొన్ని మాటలు చెప్పారు

"ఇంటికి పునాది అవసరం పునాది సరిగ్గా లేని ఇల్లు రమ్యంగా కనిపించినా ఎక్కువ కాలం నిలువలేదు రచన కూడా అంతే ముందు భాష మీద ఆధిక్యత వుండాలి తను వ్రాసే విషయం సంపూర్ణంగా తెలుసుకొని వుండాలి ఆ రచయిత వ్రాసిన రచన పది కాలాలు వుంటుంది రాసి కంటె వాసి ముఖ్యం కదా!

నువ్వు గొప్పగా అనుకునేవాళ్ళంతా కావ్యాలు, పురాణాలు, బ్రహ్మాండంగా చదివి ఆ సారంతో- ఆ పునాదిపై నిలబడి తమ విన్యాసాలు చేసిన వాళ్ళే అందుకే వాళ్ళు సాహిత్యంలోని వివిధ అంశాలను ఎన్నుకున్నా- ఎవరికి వారు 'సొంత గొంతుక' వినిపించారు మనకు వలసిన భాషా సామాగ్రి పాత రచనల్లో కుప్పలుగా నిగనిగలాడుతూ వుంది దాన్ని తాకితేగాని మాధుర్యం తెలీదు దూరం నుంచి చూస్తే 'మట్టి దిబ్బ' అనుకుంటాం నాకు నచ్చిన వ్యక్తిగా నీకు చెప్పేది ఒక్కటే- దేనికైనా పునాది చాల ముఖ్యం "

శాస్త్రిగారు భగవద్గీతలోని- కృష్ణపరమాత్ముడిలా అట్లా చెప్తూ వుంటే రామారావు నమస్కరించిన మనసుతో వింటూ వుండిపోయాడు

కొద్ది కాలం తర్వాత-

రామారావు రచనలకు ప్రాముఖ్యతనిచ్చే ఓ పత్రిక ఎడిటర్- "రచనలు పంపవలసిందిగా కోరుతూ వుత్తరం వ్రాశాడు

రామారావు ఆ ఎడిటర్‌కు బదులు రాశాడు

"కాలమంతా చదవటానికే సరిపోతోంది క్షమించండి

తృప్తి నిండిన మనసుతో వుత్తరాన్ని మరోసారి చూసుకుని పోస్టు చేశాడు- రామారావు ☐




(గత సంచిక తరువాయి)

ఎవరి కోసం వారి త్యాగం? తన కోసం  తనూ మనిషే వాళ్ళ గురించి తనెందుకింత కాలం ఆలోచించలేక పోయింది? వాళ్ళ బాదతో తను ఆనందపు ద్రోవ పరచుకుందా! ఎంత నీచత్వం? తనీ రోజు రవి కోసం రాకపోతే తనకేవేవీ తెలిసేవికాదు రవి ప్రతిమల జీవితాలలో చీకటి ముసిరేది రవి ఎంత క్షోబ అనుబవించాడు!

మనువుతో బందించబడ్డ మనసు బైటికి రాలేక మమతను చంపుకోలేక నలిగిపోయాడు  ఆటోను పిలిచి ఎక్కి కూర్చుంది

తను ఆలస్యం చేస్తే ప్రతిమ తను బాదపడుతూ రవినింకా బాదపెడుతుంది ఆమె వెళ్లిపోతాననటోంది తనే ఆపాలి మాటలతో అది సాద్యంకాదు చేతలతో చెబుతుంది  ఆటో వేగంగా పోవడం లేదనిపిస్తోందామెకు

తను పెండ్లి గురించే ఆలోచించలేదిన్నాళ్ళు రవిని గాక తను బర్తగా మరొకర్ని వూహించలేకపోయింది తన అజ్ఞానం రవిని దేశమే వదిలి పోవాలనుకొనేట్లు చేసింది  బాద కన్నీరౌతుంటే కండ్లు తుడుచుకుంది

తను పెండ్లి చేసుకోవాలి తన కోసం ఎంతో శ్రమపడ్డ రవికింక బాద మిగల్చకూడదు  తనను అర్థం చేసుకొనే వ్యక్తి  తన కన్నీరు తుడవగలిగే వ్యక్తి  చంద్రం అతడు తన కోరికను మన్నించాలి తను కావాలంటే ఏ దనవంతుడినో చేసుకోవచ్చు కాని అతడు తన డబ్బును చూస్తాడు కాని తనను చూడడు అతడికి తను పేరుకు మాత్రం బార్యగా మిగులుతుంది అలాంటి అలంకారప్రాయమైన జీవితం మనసుకు వూరట కలిగించలేదు

చంద్రం స్నేహంలో ఆప్యాయత వుంది అతడి సాహచర్యంలో అనురాగం చూపించగలడు అతడి ఆదరణే తన బాదను తరిగించగలిగేది  ఆటో ఆగడంతో ఆలోచన్లు ఆగిపోయాయి

ఆటో దిగి ఇంటి వైపు నడిచింది

వీధి తలుపు తెరిచే వుంది

సుద మెల్లగా ఇంట్లోకి అడుగుపెట్టింది

ఎవరు? ముందు గదిలో నే కూర్చొని పేపరు చూస్తున్న చంద్రం అడుగుల శబ్దం విని గుమ్మం వైపు చూశాడు

సుదాదేవిగారా  రండి ఏమిటక్కడే నిల్చుండి పోయారు?

సుద కదల్లేదు అతడి వంక అలాగే చూస్తోంది! ఇతడు తనను చేసుకొనేందుకు ఒప్పుకుంటాడా?

ఏమిటలా వున్నారు? ఆందోళనగా లేచి ఆమె దగ్గరికి వచ్చాడు చంద్రం

ఆమె కండ్లు ఏడ్చిన గుర్తుగా వుబ్బి ఉన్నాయి ముఖం వాడిపోయింది

సుదా ఏమయింది? ఎందుకలా వున్నారు?

చంద్రం  ఆమెలో దుఃఖం ఆగనన్నది అతడి గుండెల మీద వాలిపోయింది

వూహించని ఆ సంఘటనకు అవాక్కయిపోయాడు చంద్రం ఆమె కళ్ళు అతడి గుండెను తడుపుతున్నాయి

సుదా ఎందుకేడుపు? లాలనగా అడుగుతుంటే ఆమె దుఃఖం మరింత హెచ్చింది

చంద్రం మీరు  మీరు  ఇలాగే మీ గుండెలో నాకు చోటివ్వగలరా? దుఃఖబారంతో మాటలు అతి కష్టం మీద పలికింది

సుదా

చెప్పండి చంద్రం నాకీ చోటు శాశ్వతం చెయ్యగలరా? అతడి ముఖంలోకి చూసింది

అతడు గంబీరంగా నవ్వాడు  ముందు కూర్చోండి కొద్దిసేపాగి

లేదు చంద్రం ఇప్పటికే ఆలస్యమయింది ఇంకా ఆలస్యమైతే ఏం జరుగుతుందో

సుదా  ఆమెను మెల్లగా కుర్చీ దగ్గరికి నడిపిస్తూ అన్నాడు ఆవేశంలో నిర్ణయాలు తీసుకోకూడదు

చంద్రం మీరు నన్ను చేసుకోలేనని చెప్పలేక పోతున్నారు గదూ? కుర్చీలో కూర్చుని అతడి వంక చూసింది తను రవిని ప్రేమించిందని అతడికి తెలుసు అందుకే అతడు సందేహిస్తున్నట్లున్నాడు

చంద్రం రవితో నేను సన్నిహితంగా వున్నాను నిజమే కాని మేమెన్నడూ హద్దు మీరి ప్రవర్తించలేదు రవికి నన్ను చేసుకొనే వుద్దేశ్యమే లేదని ఈ రోజు

జరిగిన కథ–12  సుద, చంద్రం స్నేహంగా ఉంటున్నారు ప్రతిమ గర్బవతయింది రవికి బార్యంటే పెద్దగా అబిమానం లేదని, అతని హృదయంలో ఇప్పటికీ తనకే స్థానం ఉందని ఊహించుకుని తృప్తి పడసాగింది సుద ప్రతిమలో అనుమానం మొదలయ్యింది ప్రతిమకు కొడుకు పుట్టాడు ప్రతిమకు రవి తను సుదను ఎందుకు వివాహం చేసుకోలేదో చెప్తుంటే గోడ కవతల నుంచి సుద అంతా వింటోంది రవి తన గత చరిత్ర అంతా చెప్పి, సుదను పెళ్లి చేసుకోక పోవటానికి గల కారణం చెప్పినా కూడా ప్రతిమతన నిర్ణయాన్ని మార్చుకోదు

తెలుసుకున్నాను నేను మనసు మరల్చుకోవాలనే అతడు ప్రతిమను చేసుకున్నాడు అది తెలుసుకోలేని నేను ఏదో అనుకున్నాను. అతడి జీవితమే దుర్భరం చేశాను నేనింకా ఇలాగే వుంటే రవి ప్రతిమల అనుబంధం తెగిపోతుంది చంద్రం . ఆ ఘోరం ఆపాలంటే మీరు ... నా చెయ్యి అందుకోవాలి '

చంద్రం మదిలో ఆనందం ఇంత బాధ వున్నా సుధ మామూలుగా వుంది ఆమె మళ్ళీ దెబ్బతింటుందనే అనుమానం లేదింక

సుధా మీరు వాళ్ళ కోసం తొందరపాటు నిర్ణయం తీసుకున్నారా?"

' తొందరపాటా? నిర్లిప్తంగా నవ్వింది

'మీకిందాకే చెప్పాను ఇప్పటికే ఆలస్యమయిందని క్షణం ఏదో ఆలోచిస్తూ ఆగి అంది 'చంద్రంగారూ మీకు ఇష్టం లేదన్నా బలవంతంగా నన్ను చేసుకోమని చెప్పను కాని ప్రస్తుతం రవి ప్రతిమ విడిపోకుండా వుండేందుకు మీరు నాకు సహకరించాలి. మీరు నన్ను చేసుకుంటున్నట్టు వారి ఎదుట చెప్పండి ఈ ఒక్క సహాయం చెయ్యండి చంద్రం రండి కాదనకండి కుర్చీలో నుండి లేచింది

మీ చల్లని నీడలో నిశ్చింతగా వుండొచ్చునని ఆశించాను అది దురాశని ఇక్కడికి వచ్చాక గాని తెలుసుకోలేక పోయాను ఏమిటో చంద్రంగారూ నేను అన్నీ ఆలస్యంగానే తెలుసుకుంటున్నాను .'

సుధా చంద్రం గబుక్కున ఆమె చెయ్యి పట్టుకున్నాడు

నిజంగా నిజంగా నువ్వు నన్ను కోరి వచ్చావా? అతడి గొంతులో ఆనందం

'నేనలా అనుకోలేదు బాధలో ఆలోచించకుండా మాట్లాడావనుకున్నాను కోరి వచ్చిన నిన్ను బాధపెట్టను . చెయ్యి వదిలేశాడు

సుధా ఇంత అదృష్టం నన్ను వరిస్తుందనుకోలేదు నేను ఇందుకేనేను అమ్మవాళ్ళతో పెండ్లికి వెళ్ళలేదేమో . '

చంద్రం తల్లిదండ్రులు, చెల్లెళ్ళు బంధువులింట్లో పెండ్లికని రాజమండ్రి వెళ్లారు

చంద్రం తనకు రావాలని లేదని అన్నాడు

అంతస్తు మరిచి స్నేహం చెయ్యడమే కాకుండా పెండ్లి చేసుకుంటానంటున్నావు ఇంత మంచి మనసున్న నిన్ను పొందడంకన్నా నాకానంద మేముంటుంది ?"

సుధ చిన్నగా నవ్వింది

మీరు నా మీద అభిమానంతో అలా అంటున్నారు కాని మీరు నన్ను చేసుకొనేందుకు ఒప్పుకోడమే విశేషమని నాకు తెలుసు '

అయితే ఇద్దరి నిర్ణయం విశేషమనే చెప్పాలి. నువ్వు నన్ను కోరి వస్తావని నేననుకోలేదు. నవ్వుతూ అన్నాడు చంద్రం.

ఇద్దరూ బైటికి వచ్చారు

' రవిగారికి మనం పెండ్లి చేసుకోబోతున్నామని కాదు చేసుకున్నామనే చెబుదాము " అన్నాడు చంద్రం

ఎందుకు?"

ఎందుకేమిటి? జరిగింది గనుక."

ఆశ్చర్యంగా చూసింది సుధ.

'ఏమిటి అలా చూస్తున్నావు? మన నిర్ణయం తర్వాత నేను నీ చెయ్యి పట్టుకున్న క్షణమే మన పెండ్లయినట్టు."

అలాగా సుధతో పాటు అతడూ నవ్వాడు

రోడ్డు మీదికి రాగానే టాక్సీ ఎక్కాడు.

సుధా నువ్వీ రోజు నన్ను అందుకోబోతున్నావనేమో అనుకోకుండానే ఓ మెట్టు క్రిందికి దిగావు. కారులో రాలేదు," అన్నాడు చంద్రం.

కారు బ్రేకులు సరిగా పనిచెయ్యడం లేదు. అందుకే తీసుకురాలేదు.' అంది సుధ

ఇంకో విశేషం నేను ప్రజెంట్ చేసిన చీరలో నా ఇంటికి లక్ష్మిగా వస్తానని వచ్చావు

చంద్రం అతడెంత ఆనందపడుతున్నాడో అతడి మాటలు తెలియచేస్తోంది అతడి వైపు చూసింది సుధ అతడన్నప్పుడు గాని, ఆలోచన రాలేదామెకు తను అతడిచ్చిన చీర ధరించినట్టు బీరువా తెరవగానే కనిపించిన చీర కట్టుకుంది

'సుధా రవిగారి గురించి దిగులుపడకు ఆయన సుఖంగావుంటారు ఆమె మౌనంగావుండడం చూసి అన్నాడు చంద్రం

' చంద్రం నేనెంత పొరపాటు చేసానో తెలుసా? నాకై నేనే రవిని దూరం చేసుకున్నాను అతడి తల్లిదండ్రులను అతడి ముందే తూలనాడాను '

అతడు తల్లిదండ్రులు ఎప్పుడో పోయారన్నారు

నిజమే చంద్రం నన్నే దుష్ప్రగ్రహం ఆవరించిందో ఎప్పుడో పోయిన వారి గురించి మాట్లాడాను రవికి తల్లిదండ్రులంటే విపరీతమైన ప్రేమాభిమానాలు వున్నాయి చంద్రానికి అతడి గురించి విన్నాక అతడి మీద గౌరవభావం పెరిగింది.

"తండ్రి బాధనర్థం చేసుకున్నాడు అతడి కొడుకుగా నలుగుర్లో చెప్పుకోలేదు ప్రతిమ నిర్ణయాన్ని గూడా అతడు బాగా అర్థం చేసుకున్నాడు

ఆమెలో బాధ నిరాశ వున్నాయి అంతకంటే ఎక్కువగా అభిమానం వుంది తను పొందలేని సుఖ జీవితం రవైనా పొందాలనుకుంటోందనిపిస్తోంది

"సుధ పెండ్లి చేసుకుందంటే ఆమె కదల్లేదు రవిని బాధించడం ఆమె అభిమతం కాదు"

*    *    *    *    *

సుధ, చంద్రం టాక్సీ దిగుతూండగానే రవి లోపలి నుండి పెద్ద పెద్ద అడుగులేస్తూ బైటికి వస్తున్నాడు

"సుధా ఎక్కడికెళ్లావింతసేపు?" ఆమెను చూడగానే ఏదో బరువు దిగినట్టుగానే అన్నాడు



# మనసుకు సంకెళ్ళు

'పెండ్లి చేసుకొనేందుకు ' ముఖాన నవ్వు పులుముకుంది సుధ

'పెండ్లా తెల్లబోయి చూశాడు రవి

"ఏం చేసుకోగూడదా?" కోపాన్నభినయించింది సుధ

" నేను చందంగారిని ప్రేమించాను "

' సుదా "

ఎందుకాశ్చర్యం? అతడ్ని ప్రేమించగూడదా?" అతడి ఆశ్చర్యం చూసి నిజంగానే కోపం వచ్చింది సుధకు

"నేను అతడ్ని ప్రేమించాను పెండ్లి చేసుకున్నాను " పెండ్లి చేసుకున్నానన్నది చంద్రం చెప్పమన్న మాట

"అబద్ధం, ఇంతలో పెండ్లేమిటి?" చంద్రం వైపు చూశాడు రవి "ఏం జరిగింది? సుధ ఎందుకలా మాట్లాడుతోంది?"

'ఇక్కడే నిల్చొని చెప్పమంటారా?' నవ్వుతూ అన్నాడు చంద్రం

"సారీ, రండి లోపలికి " అంటూ లోపలికి నడిచాడు రవి

'సుధ నన్ను పిలుచుకొని సినిమాకు వెళతానని చెప్పిందట ఇంకా ఇంటికి రాలేదని మోహనరావుగారు ఫోన్ చేశారు ఎక్కడికి వెళ్ళిందో తెలియక కంగారు పడుతున్నాము "

సుద అతడి మాటలు వినడం లేదు

మేడ మెట్ల వైపు చూసి అటు నడుస్తోంటే బయంగా చూశాడు రవి

సుద సాయంత్రం మీ ఇంటికి వచ్చింది మీరు తన వల్ల బాదపడుతున్నారని తెలుసుకుంది " చంద్రం ఆమెలో మార్పుకు కారణం వివరిస్తున్నట్లుగా అన్నాడు

చంద్రం.' " కలవరంగా అన్నాడు రవి

'ఆమె మళ్ళీ మెంటల్‌గా దెబ్బ తిన్నదేమో?"

"లేదు రవిగారూ ఆమె మామూలుగా వుంది మీ శ్రమ వృదా కాలేదు మీరు ఆమె గురించేం ఆలోచించక్కర్లేదు " అంటూనే సుదననుసరించాడు చంద్రం

అతడితో రవి గూడా వచ్చాడు

'సుద పైకి ఎందుకు వెళుతోందో!" ఇద్దరికి తెలియడం లేదు

గది దగ్గరికి రాగానే సుద అడుగుల వేగం తగ్గింది మెల్లగా నడిచి ప్రతిమ దగ్గరికి వచ్చింది

' ప్రతిమా " ఆమెను చూడగానే ఏదో చేసేందుకే వచ్చిందనుకున్న ప్రతిమ ఆమె దగ్గరికి రాగానే హడలిపోయింది కాని పైకి గంభీరంగా వుండేందుకు ప్రయత్నిస్తోంది

పొత్తిళ్ళలో నిద్రిస్తున్న బాబు మీద అప్రయత్నంగానే చెయ్యి వేసింది




"ప్రతిమా ' ఆమె భయపడుతున్నదని తెలుసుకుంది సుద

"నేను ఎందుకు వచ్చానో తెలుసా?" ఆమె ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకుంది

"నిన్నేదో అనాలని, సాధించాలని కాదు నీ త్యాగం నేను భరించలేనని నీ దుఃఖంతో నేను ఆనందపు వెలుగు చూడలేనని చెప్పేందుకు " గొంతు బొంగురుపోయింది కనుకొలుకుల్లో నీళ్ళు నిలిచాయి

"ప్రతిమా చేసిన తప్పును దిద్దుకుంటున్నాను దుఃఖం మాటలను బైటికి రానివ్వడంలేదు బేలగా చూస్తోందామె వైపు

"సుదా ఏడుస్తున్నారా?" సుద చేతులను తన చేతుల్లోకి తీసుకుంది ప్రతిమ

"కాదమ్మా ఇది ఏడుపు కాదు ఆనందం నా కారణంగా జరగబోయే అనర్థాన్ని జరక్కుండా ఆపగలిగానన్న ఆనందంతో వుబుకుతున్న కన్నీళ్ళివి " వెనుదిరిగి చూసింది

"రవీ మీరు నా కోసం బాధ పడ్డ రోజులను మరిచిపోండి మీరిక బాదనేది తెలియకుండా వుండాలి కొడుకంటే మీరే అనిపించేలా వున్నారు మమత నిండిన మనుషులకు మీరే ఉదాహరణ అలాగే భర్తలకు మీరు ఆదర్శం కావాలి ఇన్నాళ్ళు మనం ప్రతిమను బాధ పెట్టాము ఆమె ఓర్పు సహనానికి పరీక్ష పెట్టినట్లే అయింది. "

"సుదా నిదానంగా మాట్లాడొచ్చు నువ్విక్కడ వున్నట్లు మీ నాన్నగారికి ఫోన్ చెయ్యి " అన్నాడు చంద్రం

"ఫోన్ చెయ్యడం కాదు మనమే వెళ్దాం " అని ప్రతిమ వైపు చూసి "అమ్మా నాన్న బయపడుతుంటారు రేపు తీరుబడిగా వస్తాను " చెప్పి క్రిందికి వచ్చింది సుధ

"రవీ మీరు నన్ను అర్థం చేసుకోక అహంభావిగా భావించారు నేను మీ తల్లిదండ్రులను ద్వేషించలేదు ఆ కారణంతో ఆ సంబంధం తప్పించుకోవాలనుకున్నాను పెండ్లి ప్రస్తావన ముందేవచ్చింది కాబట్టి మీరు మీ మనసును బైట పెడతారన్న ఆశ నన్నలా మాట్లాడించింది "

"సుధా " రవి చేష్టలుడిగి చూస్తున్నాడు

'తను తల్లిదండ్రులను అర్థం చేసుకోలేదన్నది ప్రతిమ అదేమోగాని సుద అన్నది నిజం ఆమెను తను అర్థం చేసుకోలేదు '

"రవీ ఆ రోజే మీ అనుమానం చెప్పి వుంటే ఇలా అయ్యేది కాదు " సుద అంటుండగానే ఫోన్ మ్రోగింది

ప్రక్కనే వున్న రవి అందుకున్నాడు

అవతలి నుండి మోహనరావు స్వరం వినిపించింది

"రవీ సుధ ఎవరిళ్ళలో లేదట చంద్రంగారింటికి గూడా మనిషిని పంపించాను ఇంటికి తాళం పెట్టి వుందట '

"బయపడకండి సుధ కొద్దిసేపటి క్రిందటే ఇక్కడికి వచ్చింది " రవి ఇంకా ఏదో చెప్పబోతుండగా సుద రిసీవర్ తీసుకుంది

"హలో డాడీ "

"సుధా " ఆశ్చర్యానందాలతో అన్నాడు మోహనరావు

"డాడీ మీ కూతురు మతి చలించి ఎక్కడికో పోయిందనుకుంటున్నారా?" నవ్వుతూ అంది సుధ

"ఏమిటమ్మా ఆ మాటలు?" బాధగా అన్నాడు

"డాడీ నేను చంద్రంగారింటికి వెళ్లాను ఎందుకో తెలుసా? ఎప్పటిలా స్నేహితురాలిగా కాదు అతడి అర్థాంగినవ్వాలన్న వుద్దేశ్యంతో అతడు అందుకు ఒప్పుకున్నాడు నేను చంద్రం జీవితంలో ప్రవేశించబోతున్నాను డాడీ '

చంద్రం గబ గబ సుధ దగ్గరకి వచ్చాడు

"ఏమిటి ఫోన్‌లో నేనా అన్ని మాటలు?" రిసీవర్ లాక్కోబోతే ప్రక్కకు తిరిగింది సుద

"మాట్లాడనివ్వండి చంద్రం నన్ను నన్నుగా ప్రేమించగల వ్యక్తిని పొందుతున్నానని గర్వంగా చెప్పుకోనివ్వండి నన్ను ఆరాధించే వ్యక్తి నా సర్వస్వం అవుతున్నాడని ఆనందంగా మాట్లాడనివ్వండి " మౌత్ పీస్ ప్రక్కకు తొలగించకుండానే ఆనందోద్వేగంతో మాట్లాడుతున్న తన మాటలు తండ్రి




# అభ్యాస ప్రభావం

ఏదయినా పనిని ప్రారంభించినప్పుడు చాలా కష్టమని తోచినా, నిరుత్సాహపడి దానిని విడిచి పెట్టకూడదు కొంత ప్రయత్నం చేసినా ఫలితం లభించక పోయినా విసుగు చెందకూడదు పనిని నెరవేర్చాలనే గట్టి సంకల్పం ఉంటే కొంత కాలానికది తప్పక నెరవేరుతుంది అనగననగ రాగమతి శయిల్లుచు నుండు- తినగ తినగ వేము తియ్య నుండు అని వేమనగారు చెప్పియే ఉన్నారు సంగీతం నేర్చుకునే అభిలాష ఉంటే- మొదట్లో అది కొంచెమయినా పట్టుపడక పోయినా సాధన చెయ్యడం వల్ల అది తప్పక అలవడుతుంది అభ్యాసం చెయ్యక పోతే పట్టుపడదు తెల్లవారు జామున ప్రశాంత స్థలంలో గాయకులు సాధన చేయడం మనం ఎరుగుదుము! వేపాకు చేదుగా ఉన్నా, ప్రతిదినం కొంచెం తినే అభ్యాసం చేస్తే కొన్నాళ్లకు తియ్యగా ఉన్నట్లే తోస్తుంది అంటే- అది తియ్యగా ఉంటుందని అభిప్రాయం కాదు అలవాటు వల్ల దాని చేదు చేదుగా తోచదని గ్రహించాలి

ఏ కళ గాని, ఏ విద్య కాని తిరిగి తిరిగి సాధన చేస్తూ ఉంటేనే గాని సమగ్రంగా అలవడవు కవిత్వం సంగతి కూడా అంతే! రచన పటకాలాల పాటు స్థిరంగా ఉండాలంటే- దానికి శక్తి, సామర్థ్యా-లతో పాటు అభ్యాసం కూడా మిక్కిలి అవసరమని సాహిత్య తత్త్వవేత్తలు చెప్పి ఉన్నారు ఒక సాలె పురుగు ప్రయత్నాన్ని చూచి, దానిని ఆదర్శంగా పెట్టుకొని, రాబర్ట్ బ్రూస్- యుద్ధాలలో అపజయం పొందినా, చివరకు విజయం సాధించడానికి కారణం అతని నిరంతర కృషియే యని మనకు తెలుస్తున్నది మన పూర్వులు గ్రంథాపేక్ష లేకుండా వేదాలు మున్నగు వానిని కంఠస్థం చేసి, స్వప్నంలో కూడా మరచి పోకుండా ఉండడానికి వారు చేసిన నిరంతర మననమే కారణం అట్టి గట్టి అభ్యాసం లేకపోతే అవి మరపులో పడి పోవడం, క్రమం తప్పి పోవడం తప్పక జరిగేది అందువల్ల ఎన్ని అంతరాయాలు కలిగినా, విడవకుండా ఉండే అలవాటు వుంటే తలచిన పని సఫల మవుతుంది

—బులుసు వేంకట రమణయ్య

శ్రద్ధగా విన్నాడని, అతడు తల్లితో గూడా బయలుదేరి వస్తున్నాడని ఆమెకు తెలియదు.

"సుధా నేనేదో త్యాగం చేసినట్లు భావిస్తూ నిన్ను నీవు తక్కువగా అనుకుంటే మన జీవితంలో ఆనందం వుండదు "

"లేదు చంద్రం నా వల్ల ఇంక ఎప్పుడూ ఎవరికీ బాధ కలగనివ్వను నన్ను చేసుకున్నందుకు మీరు బాధపడే రోజెప్పుడూరాదు "

"సుధా " రవి ఆమె చేతిలో రిసీవర్ తీసుకుని "నీవు మీ నాన్నగారితో ముఖా ముఖి చెప్పలేని విషయాలన్నీ ఫోన్‌లో చెప్పేశావు " అన్నాడు నవ్వుతూ

"మోహనరావుగారు ఏమనుకుంటారో " చంద్రం ఇబ్బందిగా చూస్తోంటే "ఏమనుకొనేదేముంది? మీలాంటి వుత్తముడు అల్లుడైనందుకు పొంగిపోతారు సుధ కోరి చేసుకుంటున్నదని వారికింకా సంతోషంగా వుంటుంది " అన్నాడు రవి

"మనం వెళ్దాం " సుధ బైటికి వెళ్ళబోతుంటే "కూర్చోండి హార్లిక్స్ తీసుకొని వెళుదురుగాని," అన్నాడు రవి

నాయర్ హార్లిక్స్ తెచ్చి ముగ్గురికీ ఇచ్చి లోపలికి వెళుతుండగా బైట కారు ఆగిన శబ్దం వినిపించింది

"మోహనరావుగారు వచ్చారేమో " రవి బైటి తలుపు దగ్గరికి వచ్చి చూశాడు మోహనరావు, సుభద్రమ్మ కారు దిగి వస్తున్నారు

వాళ్ళ వదనాలలో ఆనందం చిందులు వేస్తోంది

కూతురు పెండ్లి చేసుకుంటాననడంతో వారికి కొత్త వుత్సాహం గూడా వచ్చినట్లుంది

"రండి " రవి వారిని ఆహ్వానించి "నాయర్ మరో రెండు కప్పులు హార్లిక్స్ తీసుకొని రా!" అన్నాడు లోపలికి చూస్తూ

మోహనరావు, సుభద్రమ్మ కూతురి వైపే చూస్తున్నారు.

పెండ్లే చేసుకోదనుకున్న కూతురు తనే వరుణ్ణి నిశ్చయం చేసుకున్నదనేమో వాళ్ళ ఆనందంలో కాస్త ఆశ్చర్యం గూడా కనిపిస్తోంది

(అయిపోయింది)

# సీక్రెట్ ఏజంట్ విక్రమ్

11

రికార్డు గదిలో –

నేరారోపణకి పనికొచ్చే పత్రాలేమైనా ఉన్నాయేమో వెతుకు

వాటన్నిటిని చదివే సమయం లేదు అన్నిటినీ ఈ బ్రీఫ్ కేసులో కుక్కుదాం తర్వాత చూసుకోవచ్చు

పిచ్చిగా వాళ్ళు అన్నీ వెతికారు

కొంతసేపటి తర్వాత –

ఏయ్! ఈ పుస్తకం వెనక నా కేం కన్పించిందో చూడు!

గడియలాగా కనిపిస్తున్నది తిప్పి చూస్తాను

విక్రమ్ దాన్ని తిప్పుతాడు –

రహస్యమార్గం! ఏంతగా ఉందే కింద ఏముందో?

దిగి వెళ్ళి చూద్దాం!

మెట్ల మీదుగా వాళ్ళు కిందికి దిగుతారు –

పెట్టెల మీద పెట్టెలు! వాటిలో ఏ ముంటుందో ఎవరైనా ఊహించవచ్చు!

మాదకద్రవ్యాలే ఉంటాయి!

దీని కోసమే అరడజను దేశాలకి చెందిన పోలీసులు వెతుకుతున్నారు

ఆశ్చర్యంగా ఉందే, ఇంత పెద్ద గదా!

ఉన్నట్టుండి –

ఏమిటి ఆ శబ్దం?

బహుశ తెరిచిఉన్న రహస్యమార్గం తలుపుని బట్టి వాళ్ళు మనకోసం వస్తున్నట్టుంది.

(ఇంకాఉంది)

# వ్యక్తి-త్వం

ఇసుకపల్లి సుజాత



అది చైత్రమాసపు సాయంకాలం

అలలు అలలుగా తరలి వస్తున్న కోయిలమ్మ తీయని కంఠం చెవినిసోకగా మైమరచి ఆలకిస్తూ పెరట్లో చల్లటి గాలిలో నిండుగా కాసిన మామిడిచెట్టు కింద కూర్చుని రాసిగాపోసిన మల్లెపూలను మాలగా మారుస్తోంది సుహాసిని మధ్య మధ్యలో కనకాంబరాలు మరువాన్ని కూడా చేరుస్తోంది

పెరట్లో ఏం చేస్తున్నావ్ ఇందాకట్నుంచీ పిలుస్తుంటే వినిపించుకోవేం? అవతల టైమై పోతోంది వంటింట్లోంచి కేకపెట్టింది సుహాసిని తల్లి

అబ్బ వస్తున్నా నుండవే, పూలు కట్టకపోతే కట్టలేదంటావ్ కడుతుంటేనేమో లోపలికి రమ్మంటావ్ ఎట్లా చెప్పు అంటూ చెట్టు కింద నుండి లేవకుండానే విసుక్కుంది సుహాసిని

'సరేగానీ తొందరగా లోపలికిరా ముఖం కూడా కడుక్కోకుండా అలా జిడ్డుగా కూర్చున్నావ్ హెచ్చరించింది సుహాసిని తల్లి

'మాల కట్టటం కూడా పూర్తయింది ఇదిగో ఇప్పుడే వస్తున్నాను' అంటూ పూలచెండు దారం చేతిలో ఉన్న పూలబుట్టలో పెట్టి గబగబా లోపలికి నడిచింది సుహాసిని

ఇంక సిద్ధంగా ఉండండి సుమా అన్నట్టు గోడ గడియారం అయిదు గంటలు కొట్టింది

పెట్టవలసిన తినుబండారాలు ప్లేట్లల్లో సర్దేసి కాఫీ డికాక్షన్ తీసి ఏ పనీ లేకపోయినా హడావిడిగా అటూ ఇటూ తెగ తిరిగేస్తోంది సుహాసిని తల్లి

సుహాసిని తండ్రి రావలసిన వారికోసం గుమ్మం దగ్గరే నిలబడి మరి ఎదురు చూస్తున్నారు

అప్పుడే సుహాసిని హాల్లోకొచ్చింది సుహాసిని పేరుకు తగ్గట్టే ఎప్పుడూ సన్నని చిఱునవ్వులు చిందిస్తూ చూడ ముచ్చటగా ఉంటుంది

ఎవరిదగ్గరున్నిందో అరువు తెచ్చినవికావు ఆమె పెట్టుకున్న ముత్యాల నెక్లెస్‌సెట్ పక్కింటావిడని అడిగి తెచ్చిందికాదు ఆమె కట్టుకున్న బూటాతో కూడిన నీలంరంగు జరీ పట్టంచుచీర ఆమె పెట్టకున్న మల్లెపూదండ కొన్నది అంతకంటేకాదు

కళ్లకు కాటుక పెట్టి నొసట దోసగింజంత బొట్టు దిద్దిన సుహాసిని రోజూకంటే ఇంకా ముచ్చటగా ఉంది

ఆ రోజు సుహాసినికి పెళ్ళి చూపులు! ఆమె చేస్కున్న విశేషాలంకరణకు ముఖ్య కారణం అదే

నెక్లెస్ సెట్ పెట్టుకోవటం, పట్టు చీర కట్టుకోవటం, తల నిండా పూలు తురుముకోవటం ఆమె అభీష్టానికి పూర్తిగా వ్యతిరేకమైనవే

ఏదో సింపుల్‌గా కాటన్ చీర కట్టుకుని మెడలో రోజూ వేస్కునే సన్నటి గొలుసునే వేస్కుని ఒక చిన్న గులాబి పువ్వు జడలో పెట్టుకుంటే బాగుంటుందని పిస్తుంది తనకి

కానీ అమ్మ ఊర్కోదు

నీకు మంచి చీరలు నగలు లేవనుకుంటారు ఆ వచ్చిన వాళ్ళు అని అంటుందావిడ

వాళ్ళేదో అనుకుని పోతారని నా కిష్టంలేని పన్లు ఎలా చెయ్యను అయినా వాళ్ళు నన్ను చూడటానికి వస్తున్నారా లేక నా చీరలు అంటూ మధ్యలోనే ఆపేసింది సుహాసిని

అబ్బ నీతో నేను వాదించలేను గానీ నేను చెప్పినట్టు చెయ్యి అంటూ కసురుతుంది తల్లి

నేను చెయ్యను అని మొండికెయ్యొచ్చు తను కానీ అలా చేస్తే అమ్మ మనసు నొచ్చుకుంటుంది

అది తనకు కష్టంగా ఉంటుంది

అందుకని తనే సర్దుకు పోతుంది

వాకిట్లో హడావిడిని గమనించి వాళ్ళు వచ్చి ఉంటారని గబగబా లోపలి కెళ్ళి పోయింది సుహాసిని

అందరూ వచ్చి లోపల కుర్చీల్లో కూర్చున్నారు

కుశల ప్రశ్నలు పూర్తయినాయి పలు రకా వెన్నుపోట్లు, ఋతువులు పంటలు, దేశపు ఆర్థి పరిస్థితి, స్కూళ్ళు కాలేజీల చదువులు రాజకీయ స్థితిగతులు అన్నీ మాటల్లోకి వచ్చేశాక సుహాసి హాల్లోకొచ్చింది

వాళ్ళ ముందు కూర్చుంది

కుడివైపు ఓ పక్కగా కూర్చుంది పెళ్ళి కొడుకు తల్లి కాబోలు, కాస్త గొంతు సవరించుకుంది

ఆ సవరింపు వినగానే ఆవిడ పాట పాడుతుంద ఏవిఁటి? అని చిన్నగా ఉలిక్కిపడింది సుహాసిని

కానీ నీ పేరేంటమ్మాయ్? అని ఆవిడ అడగటంతో సుహాసిని మనసు తేలికపడ్డది

అవసరం ఉన్నా లేకపోయినా ఏవేవో ప్రశ్నలు వేసిందావిడ ఏమో! వాళ్ళ దృష్టిలో అవి అవసరమైన ప్రశ్నలేకావచ్చు- ననుకుని అన్నిటికి మర్యాదగా ఓపిగ్గానే సమాధానాలు చెప్పింది సుహాసిని

చివరగా ఉద్యోగం ఏమైనా చేస్తున్నావా? అని అడిగిందావిడ

మీరు కనక ఇప్పిస్తే తప్పకుండా చేస్తాను అని అందామనుకుంది

కానీ అంతలోనే చటుక్కున తన స్నేహితురాలి మాటలు జ్ఞాపక మొచ్చాయి

ఒకసారి ఆమెను ఇలాగే చూడటానికి వచ్చారట వాళ్ళు అడగాల్సినవన్నీ అడిగేశాక ఈ అమ్మాయి ఆ కాబోయే పెళ్ళి కొడుకుని మీ పేరేంటండి, ఏం ఉద్యోగం చేస్తున్నారు అతనిచేత మాట్లాడించాలనిపించి ఇలాంటి చిన్న చిన్న ప్రశ్నలే వేసిందట అంతే!

ఈ అమ్మాయికి తల బిరుసు అని లేచిపోయి ఊరంతా ప్రచారం చేశారట?!

ఆమె స్నేహితురాలు చెప్పింది గుర్తుకు రాగానే తనలో తనే తమాయించుకుని 'లేదండి నేను ఏ ఉద్యోగమూ చెయ్యట్లేదు' అని వినయంగానే జవాబు చెప్పింది

కొంచెం సేపయ్యాక వాళ్ళు వెళ్ళి పొయ్యారు అప్పుడే అనుకుంది సుహాసిని ఈ సంబంధం కుదరదని

ఎందుకంటే అంతకు ముందు వచ్చిన వాళ్ళు కూడా ఇలాగే ఉద్యోగం గురించి అడిగారు

అవి కుదరలేదు కాబట్టి ఇది కూడా అంతే ననుకుంది రేండ్రోజుల తరువాత వచ్చిన ఉత్తరంలో సుహాసిని అంతరంగంలో అనుకున్న 'మాటే రాసి ఉంది

కారణం ఉద్యోగం లేక పోవటమేనని తరువాత తెలిసింది

సుహాసినికి ఏం చెయ్యాలో తోచలేదు చూసి వెళ్ళిన వాళ్ళందరూ తను ఉద్యోగం చెయ్యకపోతే గడవని వాళ్ళేం కారు!

కానీ ప్రతివాళ్ళూ తను ఉద్యోగం చేస్తేనే పెళ్ళి చేస్కుంటామన్నట్టు మాట్లాడుతున్నారు

తనకైతే అసలు ఉద్యోగం చెయ్యటం ఇష్టమే లేదు

కానీ పెళ్ళి కోసమైనా ఉద్యోగం చేయాల్సిన తప్పనిసరి పరిస్థితి ఏర్పడింది సుహాసినికి

కానీ యిప్పుడు చేద్దామనుకున్నా ఉద్యోగం ఎవరిస్తారు? ఇది యీ రోజుల్లో అంత తేలిగ్గా అయ్యే పనికాదే

అయినా ప్రయత్నం చెయ్యక తప్పదు తల్లిదండ్రుల్ని కష్టపెట్టటం ఇష్టం లేక, అర్హతలుండి కనిపించిన వేకెన్సీలన్నింటికి అప్లై చేసింది సుహాసిని

తన యిష్టానికి పూర్తిగా వ్యతిరేకమైన

# వ్యక్తి-త్వం

పరిస్థితులకు లొంగిపోయి ఉద్యోగ ప్రయత్నంలో పడిన సుహాసిని ఎన్నో కష్టాల నెదుర్కోవలసి వచ్చింది

చివరికి ఎంతో కొంత జతంతో అసలు ఉద్యోగమంటూ వస్తే చాలు పెళ్ళయి పోతుంది కదా అన్న స్థితికి వచ్చింది

ఆ ఉద్దేశంతోటే ఎలాగైతేనేం ఒక ఉద్యోగం సంపాదించుకుంది సుహాసిని

ఆమె మనసు ఇప్పుడు తేలిక పడింది అప్పటి వరకూ ఒక పెద్ద సమస్యగా తయారైన తన పెళ్ళికి ఉద్యోగం దొరకటంతో ఒక పరిష్కారం లభించినట్టనిపించింది

మరుసటి రోజే తనను చూడటానికి ఎవరో వస్తారని చెప్పి సుహాసిని తల్లి అప్పట్నుంచే ఇంట్లో హడావిడి పడటం మొదలు పెట్టింది

అక్కడక్కడ ఉన్న దుమ్ముదులిపి ఇంటిని అందంగా అలంకరించటంలో సుహాసిని ఎంతో శ్రద్ధగా తల్లికి సహాయపడింది

ఉద్యోగం వచ్చిన తరువాత చూస్తున్న మొదటి సంబంధం ఇది అందుకే ఇది తప్పకుండా ఖాయమౌతుందనిపించింది అయినా తను వాళ్ళకి నచ్చినా అతను తనకి నచ్చాలిగా తినబోతూ రుచెందుకన్నట్టు చూడబోతూ ముందుగా ఇన్ని తర్జన భర్జన లెందుకు? అని మళ్ళీ తనలో తానే అనుకుంది

* * *

ఆటోలో వస్తూ వరలక్ష్మి కొడుకు మదన్‌తో పెళ్ళి చూపుల్లో అతను పాటించాల్సిన సూత్రాలను వల్లె వేసింది

గమ్యం సమీపిస్తుండటం చేత కొడుకుని మరో సారి నే చెప్పింది ఆటో హోరులో గాలికెగిరి పోలేదు కదా? అంతా శ్రద్ధగా విన్నావుగా తు చ తప్పకుండా చెయ్యాలి జాగ్రత్త సుమా' ఆమె ధరించిన కాసులపేరు, కంచి పట్టు చీరలోనే గాక మాటల్లో కూడా గర్వం తొణికిస లాడేట్టు కొడుకుని హెచ్చరించింది వరలక్ష్మి

'అబ్బ నువ్వు చెప్పింది కొత్త విషయమైతే శ్రద్ధగా విన్నావా లేదా అని అడగచ్చు కానీ పెళ్ళి చూపులకు వెళ్ళే ప్రతిసారి ఇలా చెప్పటం నీకు అలవాటే కదమ్మా నువ్వు చెప్పిన మాట నే నెప్పుడు కాదన్నాను మొన్నటికి మొన్న చూడు ఏమైందో ఆ అమలాపురం సంబంధం నాకు బాగా నచ్చింది ఆ అమ్మాయిని నేను చేస్కుంటా నన్నాను కానీ మీరేమన్నారు? వాళ్ళు మనం అడిగినంత కట్నం యిచ్చే స్థితిలో లేరు అందుకే చేస్కోటానికి వీల్లేదు అన్నావు అప్పుడు నీ మాటకు నేను ఎదురొచ్చానా? సరే నన్నానుగా అలాంటిది నీకింకా ఎందుకు నా మీద అనుమానం? అంటూ జరిగింది గుర్తు చేస్తూ తల్లిని ఎదురు ప్రశ్న వేశాడు మదన్

నాకు తెలుసుబాబూ నువ్వు నా మాట జవదాటవని కానీ తల్లిగా నా చాదస్తం నాది ఏమనుకోకు' ప్రేమగా కొడుకు భుజం నిమిరింది వరలక్ష్మి

గుమ్మం దగ్గర ఆటో ఆగగానే అతనికి డబ్బులిప్పించి లో పలికొచ్చారు పెళ్ళివారు

మామూలు మర్యాదలన్నీ పూర్తయినాయి సుహాసిని నేను ఉద్యోగస్థురాలిని సుమా' అన్న దిమాతో టి వచ్చినా నెమ్మదిగానే కూర్చుంది

సుహాసినికి ఇవ్వవలసిన ప్రశ్నాపత్రాన్ని మనసులో ముందుగానే సిద్ధం చేసుకుంది వరలక్ష్మి

ఇంటర్వ్యూ మొదలయింది

'నీ పేరేంటి?'

'ఎంత వరకు చదువుకున్నావ్?

సమాధానం చెప్పింది సుహాసిని

సుహాసినికి అతను నచ్చాడు

ఒక్క క్షణం మౌనం

మళ్ళీ మొదలయినాయి ప్రశ్నల పరంపర

'ఏమ్మా కుట్లు అల్లికలు ఏమైనా వచ్చా నీకు?'

'ఆఁ స్వెట్టర్లు అల్లుతాను, ఎంబ్రాయిడరీ కూడా నేర్చుకున్నానండి'

'పెయింటింగ్ అంటే మామావాడికి చాలా యిష్టం నువ్వు చెయ్య గలవా?

'చేస్తానండి అందులో ఒక కోర్స్ కూడా నేర్చుకున్నాను '

'సంగీతం వచ్చా?

'కీర్తనలు నేర్చుకుంటున్నాను'

'ఏది ఒకటి పాడి వినిపించు ఆజ్ఞాపించింది వరలక్ష్మి

కొపాన్నంతటినీ కషాయంలా దిగమింగుకొని ఖరహర ప్రియరాగం పాడి వినిపించింది

బాగుంది- బాగా లేదు అని ఏ భావననూ పైకి ప్రకటించకుండా 'పెరటి తోటల పెంపకంలో ప్రవేశం ఉందా నీకు?' అవుతుంది అని అనుకుంటున్న ఆ కాబోయే అత్తగారు అడిగింది

'వాకిలి ముందు కనిపించే ఆ చిన్న తోట నేను పెంచుతున్నదే'

'వంట?'

'రోజూ నేనే చేస్తానండి

సుహాసిని సమాధానాలు విన్న వరలక్ష్మి ముఖం ఆనందంతో వికసించింది

'బ్రతికాం గండం గడిచింది' అనుకుని విశ్వసించాడు వరలక్ష్మి భర్త

మదన్ కూడా సుముఖంగానే ఉన్నట్టు కనిపించాడు వాళ్ళ భావాలను కనిపెట్టిన సుహాసినికి సంతోషంగానే ఉంది

అప్పుడు చప్పున వరలక్ష్మి 'మాలాంటస్తు హోదా మీకు అవగాహన అయ్యే ఉంటుంది దానికి తగ్గట్టే మీరు ప్రవర్తిస్తారని అనుకుంటున్నాను నా ఉద్దేశం మీరు గ్రహించారు కదా' అర్థవంతంగా మాట్లాడి గర్వంగా ఒక నవ్వు విసిరింది

ఆవిడ మాటలు విన్న సుహాసిని యీ సమయం లోనే వీటన్నిటితో పాటు ఉద్యోగం కూడా చేస్తున్నానని చెప్తే ఆవిడ అనుకున్న అర్థం ద్వారా

# కనకం ! బొమ్మన్










తమకు కలిగే అనర్థాన్ని సమర్థ-- వంతంగా అరికట్టవచ్చు పైగా తను కొత్తగా చేరింది కాబట్టి ఉద్యోగం చేస్తున్నట్టు వాళ్ళకి తెలియక పోవచ్చు నని తనే కాస్త చనువు తీస్కుని–

నేను ఉద్యోగం కూడా చేస్తున్నానండి అంది సుహాసిని ఎంతో ఉత్సాహంగా

అంతే'

అక్కడి వాతావరణ మంతా గంబీరంగా మారిపోయింది

వరలక్ష్మి కనుబొమలు ముడివడినాయి

వెంటనే భర్తతో గుసగుసగా ఏదో మాట్లాడటం కనిపించింది

అప్పటి వరకు సంతోషంతో వెలిగి పోయిన ముఖాలు అంత గంభీరంగా ఎందుకు మారినాయో అర్థం కాలేదు సుహాసినికి

ఆమె తల్లిదండ్రులు అయోమయంలో పడినట్టు వారి ముఖ కవళికల వలన తెలుస్తోంది

తటాలున వరలక్ష్మి వాళ్ల వైపు తిరిగి

'అంతా బాగానే ఉంది కానీ మి అమ్మాయి ఉద్యోగం చెయ్యటమే మాకు నచ్చలేదండీ ఆమె ఉద్యోగం కనక మానేస్తే వెంటనే ముహూర్తాలు పెట్టుకోవచ్చు అంది ఆవిడ

నిర్ఘాంత పోయింది సుహాసిని

ఎన్నో సంబందాలు చూసిన సుహాసిని యింక విసిగిపోయింది తన అభిప్రాయాలను ఆశలను వినాలన్న ఆలోచన ఆసక్తి ఎవరిలోనూ కనిపించ లేదు

ఉద్యోగం లేని రోజుల్లో వచ్చిన వాళ్ళు ఉద్యోగం లేదని వెనుదిరిగి పోయారు ఇప్పుడు ఉద్యోగం వచ్చిందనుకుంటె దాని అవసరం లేనివాళ్ళు వచ్చారు

ఇప్పుడు తనేం చెయ్యాలి?

వచ్చిన వాళ్లంతా ఉద్యోగం చెయ్యాలని పట్టు బడుతున్నారని అష్ట కష్టాలు పడి ఎలాగో చివరికి ఉద్యోగం సంపాదించింది కానీ యిప్పుడు వీళ్ళు వద్దు అనటంతో తను మానెయ్యాలా? పైగా మానేస్తే ముహూర్తాలు కూడా పెట్టుకోవచ్చు నంటున్నారు ఆ అబ్బాయి అభిప్రాయం కనుక్కునే అవసరమే లేదా? అతన్ని తను ఒప్పుకోవటం తిరస్కరించటం అనే ప్రసక్తే లేదా? తనను సంప్రదించక్కర్లేదా? అయితే అంతా ఏకపక్ష నిర్ణయమేనా? తనకు కాబోయే వారిని తను ఏ ప్రశ్నలూ వేయకూడదా?

ఈ ఆలోచనలన్నీ ఆమె మనసుని ఆక్రమించగానే కోపం ముంచుకొచ్చేసింది సుహాసినికి

ఏదో నిశ్చయించుకున్న దానిలా కాబోయె శ్రీవారి వైపు తిరిగి–

ఆఁ చూడండి అవునూ మి చదువు పూర్తయ్యాక ఆ తరువాత మీరు ఉద్యోగంలో చేరే ముందు మూడేళ్ళగ్యాప్ ఉందని తెలిసింది ఆ టైమ్‌లో మీరేం చేశారో తెలుసుకోవచ్చా?'

మికు స్విమ్మింగ్ వచ్చా?

'గుర్రపు స్వారి చెయ్యగలరా?

'ఏ విషయం లోనైనా మికై మీరు స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకోగలరా?'

'స్వతంత్రంగా వ్యవహరించగలరా?'

అంటూ వరుసపెట్టి ప్రశ్నల బాణాలను ఎక్కుపెటి సూటిగా వదిలి–

అలా వ్యవహరించే వాళ్ళనే నేను చేస్కుంటాను

అని ఏ డొంక తిరుగుడు లేకుండా సూటిగా వాడిగా వేడిగా నిక్కచ్చిగా తన ఉద్దేశాన్ని చెప్పేసింది సుహాసిని

ఆమె తల్లిదండ్రులు కూతురి ప్రవర్తనకు నిశ్చేష్టులై నోట మాట రాక చూస్తూండి పోయారు

వరలక్ష్మి కోపంతో ఎర్రబడిన ముఖంతో దిగ్గున

'ఏమిటమ్మాయ్ ఎంత ఉద్యోగం చేస్తున్నా యింత తల బిరుసుతనం పనికిరాదు మావాడినే ఎదురు ప్రశ్నలు వేస్తున్నావే? అంటూ నిలదీసింది

అప్పుడు సుహాసిని నమ్రతగా

'క్షమించండి ఉద్యోగం చేస్తున్నానని నాలో గర్వం యీషణ్మాత్రం కూడా లేదు పైగా మిమ్మల్ని కించపరచాలనే ఉద్దేశం అంతకంటె కాదు ప్రశాంతమైన మనస్సుతో మీరు ఆలోచించాలని నేను కోరుతున్నాను మిరు ఉద్యోగం చెయ్యమంటె చెయ్యాలి మానమంటే మానాలి అంతే కానీ నాకంటూ ప్రత్యేకంగా నిర్ణయం తీసుకునే ఏ స్వాతంత్ర్యం లేదా? అమ్మాయి సకల సద్గుణవంతురాలు అన్ని కళలలోను ఆరితేరినదై ఉండాలి అని మిరు అనుకున్నారు, ఆ విషయాలు నన్ను నిలదీసి అడిగారు అందులో తప్పులేదు కానీ నాకంటూ ఏ ఆశలు ఆశయాలు ఉండకూడదా లేక ఉండవని మిరు అభిప్రాయపడుతున్నారా? నాకు కాబోయే వారు సకల విద్యాభిరాముడై ఉండాలని నేను ఆశించటం తప్పా? కనీసం అందులో ఎన్ని వచ్చో తెలుసు కోవటం కూడా నేరమేనా? స్వతంత్రించి అడిగితే తలబిరుసు పొగరుమోతు' ఇత్యాది బిరుద ప్రదానం చేసి లేని పోని నిందలు

# ఇ'వేమన'పద్యాలు




పట్టు పట్టరాదు పట్టి విడువరాదు
పట్టెనేని బిగియ బట్టవలయు
పట్టి విడుటకన్న పరగ చచ్చుట మేలు
విశ్వదాభిరామ వినురవేమ

నా మాటల్తో మిమ్మల్ని నొప్పిస్తే క్షమించండి ఆవేశంలో ఎక్కువగా మాట్లాడేశానేమో ఒకప్పుడు ఉద్యోగం చెయ్యటం యిష్టం ఉండేదికాదు కానీ నా యిష్టానికి వ్యతిరేకంగా చేయాల్సి వచ్చింది- మీలాంటి వారి వలనే' కానీ యిప్పుడు నేను ఉద్యోగం మానదల్చుకోలేదని మీకు తెలియ జేస్తున్నా' నంటూ చరచరా లోపలికెళ్ళిపోయింది సుహాసిని

అకస్మాత్తుగా కోస్తా తీరాన్ని తాకిన తుఫానులా, నిలబెట్టి దుమ్ము దులిపేసిన సుహాసిని మాటలు వరలక్ష్మి చెవుల్లో గింగుర్లెత్తి పోయినాయి ఆ తుఫానుని తట్టుకోవటానికి వరలక్ష్మికి కనీసం అయిదు నిముషాలు పట్టింది

## వ్యక్తి-త్వం

తేరుకున్న వరలక్ష్మి వెంటనే కుర్చీలోంచి లేచి 'లేరా యింకా కూర్చున్నావేం? పోదాం పద' అవమానం పాలయినట్లు భావించి కోపంతో కఠినంగా కొడుకుని ఆజ్ఞాపించింది

వరలక్ష్మి ఆ మాట అనగానే ఆమె భర్త అమాంతం లేచి నిలబడ్డాడు

సుహాసిని తల్లి దండ్రులు అప్రతిభులై అలాగే ఉండి పోయారు

విసవిసా బైటికి వెళ్ళబోతున్న తల్లిని ఆమెను అనుసరిస్తున్న తండ్రిని చూడగానే యీలోకంలో కొచ్చిన మదన్–

ఆగండి ఒక్క నిముషం నేను చెప్పేది వినండి ఆమె అన్నదాంట్లో తప్పేముంది? కాలం మారుతోంది దానితో మనం కూడా కాస్త మారాలి అయినా ఆమె సభ్యతా సంస్కారాలకు ఏమాత్రం భిన్నంగా ప్రవర్తించలేదు ఆమె అన్నది నిజమే కదా అంటూ సుహాసిని వెళ్ళిన గదివైపు తిరిగి–

'సుహాసిని గారూ ఒక సారి యిలా వస్తారా' సౌమ్యంగా పిలిచాడు మదన్

ఇలా జరుగుతుందని కలలో కూడా అనుకోలేదు సుహాసిని

తను ఇందాక ప్రవర్తించిన తీరు గుర్తు కొచ్చి బిడియపడుతూ నెమ్మదిగా వచ్చి తల వంచుకుని నిలబడింది సుహాసిని

ఇందాక ఊహించని మీ ప్రశ్నలకు నోట మాట రాక మౌనం వహించాను మా అమ్మ అడిగిన వన్నీ మీకు వచ్చినట్లే మీరు అడిగిన విద్యలన్నీ నాకూవచ్చు, పైగా మీరు నిశ్చింతగా ఉద్యోగం చేస్కోవచ్చు ఇన్నాళ్ళూ నేను స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకోలేక పోయాను అందుకు నేను చాలా అభాసు పాలయ్యాను అయినా అవన్నీ మీ కెందుకులెండి మరి నన్ను చేస్కోవటానికి మీకేమైనా అభ్యంతరమా ఆమె అడిగిన ప్రశ్నలకు యిప్పుడు జవాబులు చెప్పి చివరగా ఆమెను సూటిగా ప్రశ్నించాడు మదన్

అనుకోని యీ పరిణామానికి సుహాసిని తత్తర పడిపోయి అంగీకార సూచకంగా చిన్నగా తల పంకించి నేల చూపులు చూస్తుండి పోయింది

మదన్ ఏమిటి నువ్వంటున్నది? కోపంగా గర్జించింది వరలక్ష్మి

'అవునమ్మా ఆమె వ్యక్తిత్వం నాకెంతో నచ్చింది నేను యీ అమ్మాయినే పెళ్ళి చేస్కుంటాను ఇది నేను తీస్కున్న తిరుగులేని నిర్ణయం అంటూ తన దృఢ నిశ్చయాన్ని తల్లికి వెల్లడించాడు మదన్

కొడుకు మాటలకు బిత్తరపోయి నోట మాట రాక అచేతనంగా నిలబడి పోయింది వరలక్ష్మి

అసలు యీ వ్యక్తికి యిప్పుడొచ్చింది వ్యక్తిత్వం అరె యీ పదానికి నాకు కొత్తర్థం కనిపిస్తోందే? అవును త్వం వ్యక్తి అంటే యిప్పుడు నువ్వు వ్యక్తివి తమాషాగా ఉందే' అని మనసులోనే చర్చించుకుని మనస్ఫూర్తిగా నవ్వుకుంది సుహాసిని

కూతూరి అదృష్టానికి పొంగిపోయిన సుహాసిని తల్లి దండ్రుల కళ్ళల్లో లలగా నీటి తెర కదిలింది

తాను భార్యని ఎదిరించలేకపోయాడుగానీ తన కొడుకు ఆమెని ఎదిరించి సమంజసమైన నిర్ణయమే తీస్కున్నాడని అతను చేసిన పనికి మదన్ తండ్రి లోలోపలే మురిసిపోయాడు

అందరూ మౌనం వహించారు

ఆ మౌనాన్ని చీల్చుకుంటూ రివ్వున వీచిన సన్నని గాలి తెర సన్నాయిని తలపించింది □

## హేలీ తోకచుక్క:-

ఉస్మానియా విశ్వవిద్యాలయం ఖగోళ శాస్త్ర శాఖాచార్యులు డాక్టర్ సన్వాల్ పత్రికా ప్రతినిదులతో ముచ్చటిస్తూ హేలీ తోకచుక్క మామూలు దుర్భిణికే కనిపిస్తుందన్నారు తెల్లవారు జామున 4-30 గంటల నుంచి6-30 వరకు ఈ తోకచుక్కను తూర్పున చూడవచ్చునని ఇది సూర్యునికి వంద నియుతాల (మిలియనులు) కిలో మీటర్ల దూరంలోను, భూమికి 180 నియుతాల (మిలియన్ల) కిలో మీటర్ల దూరంలోను వుందని ఇది సూర్యునికి దూరంగా వెళ్లిపోతున్నదని ఆయన అన్నారు విసనకర్ర వంటి తోకనుబట్టి దీనిని సులభంగా గుర్తు పట్టవచ్చునని ఆయన అన్నారు ఈ తోకచుక్క ఏప్రెల్ 11వ తేదికి భూమికి 63 నియుతాల (మిలియనుల)కిలో మీటర్ల దూరానికి వస్తుందని, 76 సంవత్సరాల కొకమారు వస్తున్న ఈ తోకచుక్క మార్చి ఉత్తరార్ధంలోను, ఏప్రిల్ పూర్వార్ధంలోను చాల బాగ కనిపిస్తుందని ఆయన అన్నారు

## గిరిజనులకోసం ఎనిమిది ఆశ్రమ పాఠశాలలు:-

గిరిజనసంక్షేమ శాఖామాత్యులు శ్రీ జి రామారావు మార్చి 4వ తేదిన రాష్ట్ర విదాన సభలో గిరిజన సంక్షేమం పద్దులను ప్రతిపాదిస్తూ, రాష్ట్రంలోని అనాది గిరిజన వర్గాలకోసం ఎనిమిది ఆశ్రమ పాఠశాలలను స్థాపిస్తామన్నారు ప్రస్తుతం వున్న 19 గిరిజన ఆశ్రమ పాఠశాలలు బాగా పనిచేస్తున్నాయని అన్నారు గిరిజనుల కోసం 35 విద్యార్థి వసతి గృహాలు నెలకొల్పుతామని, వీటిలో 25 ప్రత్యేకంగా గిరిజన బాలికల కోసమని అన్నారు గిరిజన ప్రాంతాల సర్వతోముఖాభివృద్ధికి 51 కోట్ల రూపాయల పథకం సిద్ధపరచామని అన్నారు

## కేంద్రప్రభుత్వం బడ్జెట్‌పై భిన్న స్వరాలు:-

కేంద్రప్రభుత్వం బడ్జెట్‌పై జంటనగరాల వాణిజ్య పారిశ్రామికరంగాలలో బిన్న స్వరాలు వినిపిస్తున్నాయి ఈ బడ్జెట్‌లో హరిజనులకు, గిరిజనులకు, ఇతర బలహీనవర్గాల దారిద్ర్య నిర్మూలనకు తగినన్ని నిధుల కేటాయింపు జరిగిందని ఆంధ్రప్రదేశ్ వాణిజ్య మండలుల సమాఖ్య అధ్యక్షులు శ్రీ సోమా వేంకటేశ్వరరావు వాఖ్యానించారు లాభదాయకం కాని సంక్షేమ పథకాలను ప్రోత్సహించడ మొక్కటే విచారకరమైన

# హైదరాబాదు నోట్‌బుక్

లక్షణమని ఆయన తెలిపారు బడ్జెటు అబివృద్ధి ప్రదానమైనదని ఆంధ్ర వాణిజ్య మండలి ఉపాధ్యక్షులు శ్రీ డి సీతారామయ్య తెలిపారు బడ్జెట్ వివిదాంశాలను స్పృశించినా, సంఘంలోని ఏ వర్గానికి సంతృప్తికరంగా లేదని హైదరాబాద్ మేనేజ్‌మెంట్ అసోసియేషన్ ఉపాధ్యక్షులు శ్రీ శ్యాంమోహన్ అన్నారు హరిజన గిరిజనుల కోసం గృహనిర్మాణ పథకాలు అమలు కావడం పట్ల సంశయం ప్రకటించారు కలర్ టీవీల ఎయిర్ కండిషన్ కార్లపై సుంకంవల్ల ప్రభుత్వానికి రాబడి ఎక్కువగా వుండకపోగా క్రేతలకు నష్టమని ఆయన అన్నారు బడ్జెట్‌లో మోటారు వాహనాల ఇంజనీరింగ్ పరిశ్రమలకు తగినంత ప్రోత్సాహమేమి లేదని ఆంధ్రప్రదేశ్ వాణిజ్య మండలుల సమాఖ్య ఉపాధ్యక్షులు శ్రీ బి జి శాస్త్రి అన్నారు లోటు బడ్జెట్ వల్ల నిత్యావసర వస్తువుల దర మరింత పెరుగుతుందని ఆంధ్రప్రదేశ్ చిల్లర కిరాణా వర్తకుల సమాఖ్య కార్యదర్శి శ్రీ టి గౌరరాజు అన్నారు బడ్జెట్ లక్ష్యరహితమైనదని, నిజమైన దారిద్ర్య నిర్మూలన పథకాలేవీ దానిలో లేవని తెలుగుదేశం పార్టీ ప్రదాన కార్యదర్శి శ్రీ చంద్రబాబు నాయుడు అన్నారు 3650 కోట్ల రూపాయల లోటును పూడ్చడానికి కేంద్రం కొత్త పన్నులనన్నా విదిస్తుందని లేక, నోట్లనన్నా ముద్రిస్తుందని ఆయన సూచించారు ఆర్డినెన్స్‌ల ద్వారా పన్నులు విధించే 'దుష్ట సంప్రదాయాన్ని కేంద్రం అనుసరిస్తున్నదని, వ్యవసాయానికి తగినంత నిదుల కేటాయింపు లేదని, ఎనిమిదవ ఫైనాన్స్ కమిషన్ సూచించిన సిఫార్సులను అమలుపరచనందున రాష్ట్రం తనకు రావలసిన వాటా కోల్పోతున్నదని, రాష్ట్రం 200 కోట్ల రూపాయలను వదలుకోవలసి వస్తున్నదని, విశాఖపట్నం ఉక్కు కర్మాగారానికి 700 కోట్ల కేటాయింపు వల్ల, అది పూర్తికావటానికి మరొక దశాబ్దం పడుతుందని శ్రీ చంద్రబాబు నాయుడు అన్నారు ఈ బడ్జెట్ కేవలం ప్రచార పరమార్ధమని చిన్న సౌకర్యాలు కలిగించినట్టు పైకి కనిపించినా ద్రవ్యోల్బణం మితిమీరి పోతుందని రాష్ట్ర బి జె పి వ్యాఖ్యానించింది కొత్త పన్నులు లేకపోవడమనే సంతోషం అట్టే కాలం వుండదని, పెద్ద లోటును పూడ్చడానికి కొత్త పన్నులు తప్పవని రాష్ట్ర బి జె పి ప్రదాన కార్యదర్శి శ్రీ బండారు దత్తాత్రేయ అన్నారు ఈ బడ్జెట్టు కలవారికి లాబకరమని మధ్యతరగతి వారికి లాబకరంగా కనిపించినా విద్యను పూర్తిగా విస్మరించిందని ప్రోగ్రెసివ్ డెమోక్రాటిక్ స్టూడెంట్స్ యూనియన్ అధ్యక్ష కార్యదర్శులు శ్రీయుతులు ఎస్ వేంకటేశ్వరరావు పి రంగారావు అన్నారు

## డాక్టర్ రాజశేఖరరెడ్డి విమర్శ.-

హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ ఎన్నికలలో తెలుగుదేశంపార్టీకి శ్రీమంతులైన కమ్మవారు, పెద్ద కమ్మ భూస్వాములు తోడ్పడ్డారని రాష్ట్ర కాంగ్రెస్ ఐ అద్యక్షులు శ్రీ జలగం వెంగళరావు కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ రాజీవ్‌గాంధికి పంపిన నివేదికలో కమ్మ కులస్థులను ప్రత్యేకంగా పేర్కొనడం దురదృష్టకరమని రాష్ట్ర కాంగ్రెస్ ఐ విదాన సభ్యుడు, ౹ ౹్ష్ట కాంగ్రెస్ ఐ మాజీ అధ్యక్షులు డాక్టర్ వై యస్ రాజశేఖరరెడ్డి ఫిబ్రవరి 27న పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో వ్యాఖ్యానించారు శ్రీ జలగం వెంగళరావు ప్రత్యేకంగా ఒక కులాన్ని పేర్కొనడం ఉచితంకాదు కమ్మవారంతా తెలుగుదేశం పార్టీవారా? కాంగ్రెస్ ఐ లోక్‌సభా సభ్యులు ఆరుగురిలో ప్రొఫెసర్ ఎన్ జి రంగాతో పాటు ఇద్దరు కమ్మవారున్నారు మునిసిపల్ కార్పొరేషన్ ఎన్నికల సమయంలో బాంబులు విసిరిన ఆరోపణపై అరెస్టు చేయబడిన ఎం ఎల్ ఏ లు కమ్మవారు కారే! రాష్ట్ర కాంగ్రెస్ ఐ సంఘం ఒక కులంపై బురద చల్లడం ఉచితంగా లేదు - అని ఆయన అన్నారు ఈ విదంగా వ్యాఖ్య చేయడం వల్ల రాష్ట్ర కాంగ్రెస్ ఐ అధ్యక్షుని దిక్కరించినట్లు కాదని తనకు శ్రీ వెంగళరావుపై ఎలాటి దురబిప్రాయమూ లేదని, కాని, ఒక కులంపై ఇలాటి వ్యాఖ్యలు పనికిరావని మాత్రమే తన అభిప్రాయమని ఆయన అన్నారు

## ఉపశ్రుతి:-

తాతా తాతా, ఇంత మంచి ద్రాక్షపళ్ళు తెచ్చావు కాని, గింజలు లోపల పెట్టావు - అని ముఖం చిట్లించుకొన్నాడు మనమడు ఫల్గున బాబూ గింజలేని వాడు - అంటే ఆది లేనివాడు ఒక్క బగవంతుడే సుమా - అన్నారు మా సంబాషణ వింటున్న ఒక పండితులు ఏం తాతా, ఈయన ఇట్లా అంటున్నారు? గింజలు లేని ద్రాక్ష నేను తిన్నానే - అన్నాడు ఫల్గున దానికి కూడా మూలం ఉంది నాయనా - అన్నారు ఆ పండితులు తాతా, నా కదంతా తెలీదు గింజలు లేని ద్రాక్ష తే ఈసారి - అని దబాయించాడు ఫల్గున

-తిరుమల రామచంద్ర

Printed and Published for Nageswara Rao Estates Private Ltd , by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada 3, Editor S Radhakrishna
Phones Business 61247, 61248, Editorial 75667



లైనెస్ క్లబ్ విజయవాడ – తూర్పువారు నిర్వహించిన లలిత సంగీత విభావరిలో శ్రీమతి ఇంద్రగంటి జానకిబాల, కుమారి డోకల కమలాంజలి, కుమారి సూరి సత్యవాణి శ్రీ రాజారామ్.

## కళాసాగర్ ఫిలిం క్రిటిక్స్ అవార్డ్స్–85

ఉత్తమ చిత్రం– ప్రతిఘటన, ఉత్తమ దర్శకుడు– టి కృష్ణ (ప్రతిఘటన)), ఉత్తమ నిర్మాత– ఎ హెచ్ రామోజీరావు (మయూరి), ఉత్తమ నటుడు– శోభన్ బాబు( దేవాలయం) ప్రత్యేక ప్రశంస మురళీ మోహన్ (ఓ తండ్రి తీర్పు) ఉత్తమ నటి– విజయశాంతి (ప్రతిఘటన), ప్రత్యేక ప్రశంస– సుదా చంద్రన్ (మయూరి) ఉత్తమ క్యారెక్టర్ నటుడు– సుతి వేలు (ప్రతిఘటన) ఉత్తమ క్యారెక్టర్ నటి – శారద (పల్నాటి సింహం) ఉత్తమ హాస్య నటుడు – కోట శ్రీనివాసరావు (ప్రతిఘటన)) ఉత్తమ హాస్య నటి – రమాప్రభ (ముచ్చటగా ముగ్గురు) ఉత్తమ కథారచయిత – కామేశ్వరరావు) వందేమాతరం) ఉత్తమ సంభాషణ రచయిత – యం వి యస్ హరనాథరావు (ప్రతిఘటన) ఉత్తమ నేపథ్య గాయకుడు – యస్ పి. బాలసుబ్రహ్మణ్యం ("కిరవాణి".... "అన్వేషణ"), ఉత్తమ నేపథ్య గాయని – పి. సుశీల ("ఈ కుంకుమతో" ... "పల్నాటి సింహం"), ఉత్తమ సంగీత దర్శకుడు – యస్. పి. బాలసుబ్రహ్మణ్యం (మయూరి), ఉత్తమ ఛాయాగ్రహకుడు – యం. వి. రఘు (అన్వేషణ).

## అవీ–ఇవీ–అన్నీ

20–4–86 న మద్రాసు – మ్యూజిక్ అకాడమి హాలులో జరిగే కళాసాగర్ 14వ వార్షికోత్సవ సభలో అవార్డు బహూకరణ ప్రత్యేక ఆహ్వానితుల సమక్షంలో జరుగుతుంది

కళాసాగర్ ఫిలిం అవార్డ్స్ – 85 న్యాయ నిర్ణేతలుగా శ్రీ నండూరి రామమోహన్‌రావు (ఎడిటర్ ఆంధ్రజ్యోతి విజయవాడ), డా. వి. కోటేశ్వరమ్మ (డైరెక్టర్ మాంటిస్సోరి మహిళా కళాశాల– విజయవాడ) డా పి. దక్షిణామూర్తి (ఫిలిం క్రిటిక్ తెనాలి) గార్లు వ్యవహరించారు.

## స్నేహవీణ

"స్నేహవీణ" తెలుగులో కవితలు, కథలు, వ్యాసరచన , కార్టూన్, చిత్రలేఖనము పోటీలు నిర్వహిస్తున్నది ఆసక్తి గల రచయిత (త్రు)లు "స్నేహ వీణ, ఎ బి నెం. 32, సికింద్రాబాద్–500 003" అను చిరునామాకు జాబు వ్రాసి వివరాలను పొందవచ్చును.

## ప్రపంచ కార్టూన్ ప్రదర్శనలో జయదేవ్ కార్టూన్

సుప్రసిద్ధ కార్టూనిస్టు డా ఎస్ జయదేవ్ బాబు వేసిన కార్టూన్‌లలో ఒకదానిని ఈ సంవత్సరం జూన్ నించి సెప్టెంబర్ వరకూ బెల్జియంలో జరిగే 25వ ప్రపంచ కార్టూన్ ప్రదర్శనలో ప్రదర్శించడానికి



ఎంపిక చేసారు. ప్రపంచం అంతటి నించి వచ్చిన కార్టూన్‌లలో ఎంపిక చేసిన వాటిని మాత్రమే ఈ ప్రదర్శనలో ప్రదర్శించడం జరుగుతుంది వాటిలో ఉత్తమంగా ఎన్నికైన కార్టూన్‌లు మూడింటికి వరుసగా బంగారు, వెండి, కంచు కప్‌లని బహుమతిగా అందజేస్తారు. □

